# * జోకులు *

నేర్చుకోండి :- "నే నెన్నిసార్లు ప్రశ్నలడిగినా ఒక్కరైనా సరియైన జవాబులు చెప్పడం లేదు నేనేంచేయాలి?" విసుక్కుంటూ అడిగారు తరగతితో మాష్టారుగారు

"విద్యార్థులకు అర్థమయ్యేవిధంగా చక్కగా పాఠాల్ని చెప్పడం నేర్చుకోండి" టక్కున అన్నాడు ఓ గడుగ్గాయి.

ఈజన్మకు:- ఏమోయ్ సుబ్బయ్యా! నీవు నీ భార్య ముందు ఏమీ తెలియని అమాయకులముందు బాగా గొప్పలు చెప్పుకుంటావని, డబ్బులిచ్చి మూర్ఖులచే పొగడించుకుంటావని విన్నాను ఇదినిజమేనా?" అడిగాడు రాజయ్య సుబ్బయ్యను.

"నిజమే రాజయ్యా! తెలివితేటలులేని నేను ఎలాగు గొప్పవాళ్ల దగ్గరకు పోలేను. కనీసం నా భార్యముందు ఏమీ తెలియని అమాయకులముందు లేనిపోని గొప్పలు చెప్పుకొంటు కిరాయి మనుషులద్వారా పొగడించుకొంటూ బ్రతుకుతున్నాను అంతేచాలు ఈజన్మకు అంటూ ఇంటివైపు పరుగెత్తాడు సుబ్బయ్య.

సంప్రదాయం:- ఏమే భర్తనైన నన్ను తిడుతూ కొడుతావని బెదిరిస్తావా? ఇదేనా నీకు మీవాళ్లు నేర్పింది?" కొత్తగా కాపురాని కొచ్చిన భార్యను కోపంగా అడిగాడు భర్త.

"ఔనండీ మా తల్లిగారింట్లో మాఅమ్మ, నాన్నను కొడు తుంది. మా వదినలతో మా అన్నలు రోజు చావు దెబ్బలు తింటారు. మా అక్కలు బావల్ని కొట్టందే అన్నం ముట్టుకోరు. ఆడవాళ్లెలా మెదిలినా మావాళ్లు చూస్తూ ఊరుకుంటారు అది మా సంప్రదాయం. నేనెలా మెదిలినా నీవు నోరు తెరచి మాట్లాడ కూడదు" అంటు హెచ్చరిచ్చిందా భార్యామణి. భర్త వెంటనే విడాకులకొరకు కోర్టువైపు పరుగెత్తాడు.

బంధువులు :- "బంధువులు ఇంటికి వస్తే ఏం చేస్తావురా గోపి!" అడిగారు టీచర్‌గారు.

"చెప్పు అడిగి బిస్కెట్లు కొనుక్కొని తింటాను!" సార్ టక్కున చెప్పాడు గోపి.

# ఎర్రోజు సత్యం
## సాహితీ కిరణాలు
( 1వ భాగం )

ప్రచురణ: శ్రీనివాస పబ్లికేషన్స్, రాచర్లబొప్పాపురం

ప్రథమ ముద్రణ: ఆగష్టు 1986

వెల: 4-00

28281



ఈ కృతిలోని రచనల్ని ప్రచురించిన పలుపత్రికాధిపతులకు, ప్రసారం కావించిన ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారికి కృతజ్ఞతలు—

ముద్రణ:

**నారాయణ ప్రింటింగ్ ప్రెస్, సిరిసిల్ల. ఫోన్: 142**

ముఖచిత్రం: ఆనంద్

ప్రతులకు: *ఎర్రోజు సత్యం రాచర్ల బొప్పాపురం-505 305.

తాలూక సిరిసిల్ల, జిల్లా: కరీంనగర్.

*కొండ వీరయ్య సన్స్, పుస్తకముల వ్యాపారము

హైదరాబాద్, సిద్దంబర్ బజార్.

* ఇతర పుస్తకముల దుకాణముల నుండియు పొందవచ్చును.

# విషయ సూచిక

పేజి

# అంకితం

## శ్రీ నేవూరి వెంకటరెడ్డి
## పంచాయతి సమితి అధ్యక్షులు సిరిసిల్ల గారికి

శ్రీ నేవూరి వెంకటరెడ్డి గారూ!
ఎంతో సహృదయులు మీరు.
సిరిసిల్లా సమితిలోని
ఎల్లారెడ్డిపేట మండలమున
చంద్రమ్మ-గాల్ రెడ్డి పుణ్య దంపతులకు
చంద్రునివలె జన్మించారు
చల్లని మనసుతో
చక్కని ప్రవర్తనతో
పెరిగి పెద్దవారై
ప్రజా సేవకే అంకితమయ్యారు
ప్రజాభిమానాన్ని చూరగొన్నారు
నిరాడంబర జీవులైన మీరు
నిస్వార్థ సేవాపరాయణులైన మీరు
ఎల్లారెడ్డిపేట గ్రామ సర్పంచుగా
ఎన్నోసార్లు ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు
జిల్లా సి. సి. బ్యాంకు సభ్యులుగా
జిల్లా గ్రంధాలయ సంస్థ సభ్యులుగా
తాలూకా మార్కెటింగు కమిటి అధ్యక్షులుగా

శ్రీ వేములవాడ రాజరాజేశ్వర స్వామి దేవాలయ ధర్మకర్తల
సంఘ సభ్యులుగా
వర్మాల సమితి అధ్యక్షులుగా
సిరిసిల్ల పంచాయతి సమితి అధ్యక్షులుగా
ఎన్నో పదవులు చేపట్టారు
ఆ పదవులకే మీరు గౌరవాన్ని సంపాదించిపెట్టారు
వివిధ పదవులలో మీరు ప్రదర్శించిన కార్యదక్షత
మీరు సాధించిన అభివృద్ధి చేసిన సేవలు
చిరస్మరణీయములు ఆదర్శ ప్రాయములు
ఇంకా మీరు ఎన్నో ఇంకెన్నో పదవులు చేపట్టి
ఎంతో ఇంకెంతో ప్రజాసేవచేయాలని
అందుకు మీకు భగవంతుడు
ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించాలని
నిండుమనసుతో దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను
మంచికి మమతకు మారుపేరైన మీకు
సాహిత్యాభిమానులైన మీకు
సంతోషంగా అంకితమిస్తున్నాను
'సాహితీ కిరణాలు' కృతిని అందిస్తున్నాను.

రచయిత



నేపూరి వెంకటరెడ్డి

అధ్యక్షులు

పంచాయతి సమితి, సిరిసిల్ల.

# స్వీకృతి

శ్రీ ఎర్రోజు సత్యం గారికి శుభాకాంక్షలు ...

మీరు రచించిన "సాహితీ కిరణాలు" కృతిని స్వీకరించవలసినదిగా మీరెంతో అభిమానంతో కోరారు. మీ కృతిని స్వీకరించే అర్హత నాకు లేకపోయినా మీ మాటను కాదన లేక మీ పై నాకున్న అభిమానంతో స్వీకరిస్తున్నాను.

మీ ఆప్యాయతకు అభిమానానికి సంతోషిస్తూ సాహిత్యరంగంలో మీరు చేస్తున్న కృషిని మనసార అభినందిస్తూ సాహిత్య రంగంలో మీరు చేసే కృషికి నా సహకారం ఎల్లప్పుడు ఉంటుందని హృదయ పూర్వకంగా చెపుతూ మీ ప్రగతిని కాంక్షిస్తున్నాను.

అభిమానంతో

28-3-1986

నేపూరి వెంకటరెడ్డి

# ఆకాంక్ష

జి. వెంకటరెడ్డి
మండల అభివృద్ధి అధికారి పంచాయతి సమితి, సిరిసిల్ల.

శ్రీ ఎర్రోజు సత్యంగారు రచించిన "సాహితీ కిరణాలు" పుస్తకంలో పిల్లలకు, పెద్దలకు పనికి వచ్చే రచనలు ఉన్నాయి. గేయాలు జానపద గేయాలు, పిల్లల పాటలు, వచన కవితలు, మంగళహారతి, పాటలు, నీతికథలు మొదలగు వివిధ ప్రక్రియలలో ఈ పుస్తకాన్ని రచించారు సత్యంగారు.

"పదరా తమ్ముడ పదరా" అను గేయంలో సోమరితనం పనికి రాదని, ఉత్తేజంతో పరిశ్రమిస్తూ ఉన్నత శిఖరాలెక్కాలన్న సందేశాన్ని అందించారు సత్యంగారు. "జీవితమంటే సుఖమని" గేయంలో జీవిత మంటె కష్ట సుఖాల కలయికే నన్న నగ్న సత్యాన్ని సత్యం కవి గారు చక్కగా చాటి చెప్పారు.

"చదువురాకపోతే" ,జానపదగేయంలో చదువురాకపోతే ఎంత నష్టమో, చదువు నేర్చుకుంటే ఎంతలాభమో జాన పదులకు అర్థమయ్యే విధంగా చక్కగా రచించారు. "మొగుడో నా మొద్దు మొగడా" జానపద గేయంలో అపమర్థుడు, అసూయా పరుడైన భర్తకు భార్య ఎంతో ముద్దుగా బుద్ధి చెపుతుంది. ఈ కావ్యంలోని గేయాలు వచన కవితలు, పిల్లల పాటలు, నీతికథలు ఎంతో విజ్ఞానాన్ని కలిగిస్తాయి. నీతిని బోధిస్తాయి.

బాలలకు పనికివచ్చే గేయాల్ని, పిల్లల పాటల్ని ప్రబోధ గేయములుగా పాఠశాలల్లో బాలలకు నేర్పించుటకై ఉపాధ్యాయ సోదరులు సహకరించగలరని కాంక్షిస్తున్నాను.

వివిధ ప్రక్రియలు చేపట్టి విద్వాంసుల మెప్పు నందుకునే విధంగా చక్కని శైలిలో "సాహితీ కిరణాలు" కృతిని రచించిన సత్యంగారిని అభినందిస్తూ సాహిత్య రంగంలో వీరు జాబిలివలె ప్రకాశించాలని ఆకాంక్షిస్తున్నాను.

# కోరిక

"సాహితీ కిరణాలు" వివిధ సాహితీ ప్రక్రియల సంకలనం. రచయిత ఎర్రోజు సత్యం బాల సాహిత్యంలో మంచి రచనలు చేశారు. పిల్లల అవగాహన స్థాయిలో ఆయన రాసిన గేయాలు, కథలు చాలా ఉన్నాయి. పిల్లలకే కాక పెద్దల కోసం కూడా ఆయన కథలు, పాటలు, జానపదగేయాలు, వయోజన విద్యకు సంబంధించి సందేశాన్నిచ్చే కవితలు సత్యంగారి 'సాహితీ కిరణాలు' సంకలనంలో చోటు చేసుకున్నాయి. ఉత్తమ ఉపాధ్యాయుడిగా పేరు తెచ్చుకున్న ఎర్రోజు సత్యంగారు భవిష్యత్తులో బాల బాలికలలో క్రమశిక్షణను పెంపొందించి భావిపౌరులుగా రూపొందేందుకు తోడ్పడే మరిన్ని మంచి రచనలు చేస్తారని ఆకాంక్షిస్తున్నాను.

—బుడ్డిగ సుబ్బారాయన్
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ
34/4RT, బర్కత్‌పురా,
హైదరాబాద్-500 027.

# సాహితీ దినకరుడు

ఏరోజు ఎర్రోజు సత్యంను మర్చిపోలేను. ఆయన స్నేహశీలి మాత్రమే కాదు క్రియాశీలి. విద్యా నందనవనానికి తోటమాలి.

సత్యం "బాలలోకం", "పిల్లల పాటలు" అనే రెండు బాలగేయ సంపుటాలు చూపించినపుడు నేను ఆశ్చర్యపోలేదు. ఆయన బాలసాహిత్యం చక్కగా రాయగలరని నాకు తెలుసు కాబట్టి.

సిరిసిల్లా పంచాయతీ సమితిలోని రాచర్లబొప్పాపురం గ్రామ సమితి ప్రాథమికోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పని చేస్తున్న ఎర్రోజు సత్యం సమితిచే నిర్వహింపబడిన ఉపాధ్యాయుల సన్మాన సభలో ఉత్తమ ఉపాధ్యాయులుగా సత్కరింపబడినారని తెలిసికూడా నేను ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే సత్యంగారు తన జీవితం ఉపాధ్యాయ వృత్తికి అంకితం చేసి విద్యార్థులకు అర్థమయ్యే విధంగా పాఠాల్ని చక్కగా బోధిస్తూ తన బాధ్యతల్ని ఆదర్శవంతగా నిర్వహించగలరన్న గట్టి నమ్మకం నాకుందికాబట్టి.

సత్యం అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొని ఏకపాత్రాభినయాలు బహుపాత్రాభినయాలు చేసి "శభాష్ సత్యం" అని పొగడ్తలందుకున్నారని తెలిసికూడా నేను ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే ఆయన నిర్మల్‌లో బేసిక్ ట్రెయినింగ్ పొందుతున్నప్పుడే అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొని గొప్పవాళ్ళచే ప్రశంసనందింది. ఉత్తమ నటునిగా యోగ్యతా పత్రం పొందియున్నారని, సహజంగా ఆయనలో నటనాచాతుర్యం ఉందని నాకు తెలుసుకాబట్టి.

తాను పనిచేసే పాఠశాలలోని మంచి నడవడి కలిగిన

విద్యార్థికి, పాఠశాలలోని విద్యార్థులందరికన్నా ఎక్కువ మార్కు లతో పాసైన విద్యార్థికి, చిత్రలేఖనము, సాహితీ సాంస్కృతిక రంగాలలో ప్రథమ శ్రేణికి చెందిన విద్యార్థులకు ప్రతి సంవత్సరం (ఆగస్టు 15వ తేదీన) స్వాతంత్ర్య దినోత్సవం నాడు మొత్తం రెండు వందల రూపాయల చొప్పున తన సర్వీసు ముగిసే వరకు ప్రోత్సాహ బహుమతి ఇవ్వగలనని సభాముఖంగా ఎర్రోజు సత్యం ప్రకటించారని తెలిసికూడా నేను ఆశ్చర్య పోలేదు. ఎందుకంటే మంచిని, తెలివితేటల్ని, లలితకళల్ని ప్రేమించే ఎర్రోజు సత్యంగారికి చదువుపట్ల మంచి విద్యార్థుల పట్ల ఎంతో వాత్సల్యం, అభిమానం ఉన్నాయని నాకు తెలుసు కాబట్టి.

ఎర్రోజు సత్యం సాహితీ కిరణాలు పుస్తకం నా చేతికిచ్చి నపుడు మాత్రం నేను అమితంగా ఆశ్చర్యపోయాను. ఎందు కంటే ఆయన బాలసాహిత్యమేకాక, గేయాలు, జానపదగీతాలు మంగళ హారతి పాటలు, వయోజన విద్యా ప్రయోజనాన్ని తెలుపుతూ సందేశమిచ్చే పాటలు జీవితాన్ని ప్రతిబింబించే చక్కని కథలు ఒకటేమిటి అనేక ప్రక్రియలు ఈ సంకలనం లో ఉన్నాయి. నాకు తెలిసిన బాలసాహిత్య రచయిత ఎర్రోజు సత్యం ఇన్ని సాహితీ ప్రక్రియలను ఇంత సమర్థవంతంగా రాయగలడనే విషయం తెలిసినపుడు నేను ఆశ్చర్యపోవడంలో ఆశ్చర్యం లేదనుకుంటాను.

మిత్రుడు ఎర్రోజు సత్యం సాహితీ దినకరుడు తన సాహితీ కిరణాలను వెదజల్లుతూ దిన దిన ప్రవర్ధమానుడై అభివృద్ధి చెందాలని మనసారా కోరుకుంటున్నాను.

—చొక్కాపు వెంకటరమణ
ఇన్‌చార్జ్ ఎడిటర్ బాల చంద్రిక
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి హైద్రాబాద్.

# ముందు మాట

## కృతజ్ఞతలు

మన రాష్ట్రంలో బాల సాహిత్యం చాలినంతలేదు. రచయితగా ఈ లోటును కొద్దిగానైన తీర్చాలన్న సదుద్దేశ్యము నాకు కలిగింది. ఆ ఉద్దేశ్యంతోనే నేను రచించిన నవలలు, కథలు, నాటికలు, గేయాలు అచ్చు చేయించకుండా ముందుగా పిల్లల పాటల్ని అచ్చు చేయించాలని ప్రయత్నించాను. నా ప్రయత్నాన్ని అభినందిస్తూ అనేక మంది సాహిత్యాభిమానులు ఆర్థికంగా, హార్దికంగా ప్రోత్సహించడంచేత 1978 లో "పిల్లల పాటలు" మొదటి భాగం కృతిని అచ్చుచేయించాను. ఆతర్వాత 1980తో సహృదయులు, సాహిత్యాభిమానులైన శ్రీ కె. యస్. శర్మ మాజీ కలెక్టర్ కరీంనగరం గారు నా "బాలలోకం" కృతిని అచ్చుచేయించారు. 1982వ సంవత్సరం లో సహృదయులు, సాహిత్యాభిమానులైన శ్రీయన్. వెంకటరెడ్డి మాజీ అధ్యక్షులు పంచాయతీ సమితి సిరిసిల్ల గారు, శ్రీ ఆర్. పాపారావు మాజీ అధ్యక్షులు పంచాయతీ సమితి వేములవాడ గారు. ఉపాధ్యాయ సోదరులు "పిల్లల పాటలు" రెండవ భాగం కృతిని అచ్చుచేయడానికి సహకరించారు. ఈ మూడు పుస్తకాలు పిల్లల, పెద్దల మెప్పును పొంది రచయితగా నాకు మంచి పేరును తెచ్చి పెట్టాయి.

అనేక మంది సాహిత్యాభిమానులు, నా మిత్రులు నేను రచించిన గేయాల్ని, వచన కవితల్ని, కథల్ని అచ్చు చేయించు మని కోరినారు. ఈ "సాహితీ కిరణాలు" కృతి ద్వారా గేయములు, జానపద గేయాలు, పిల్లల పాటలు, వచన కవితలు, మంగళ హారతి పాటలు, నీతి కథలు, మంచిమాటలు మొదలైన వివిధ సాహితీ ప్రక్రియలతో కూడుకొన్న రచనల్ని అందిస్తున్నాను. ఈ పుస్తకం పిల్లలకు, యువకులకు, పెద్దలకు పనికి వస్తుందని నా అభిప్రాయం.

సమాజానికి పనికి రాని సాహిత్యం శవంతో సమానమని

నమ్మే వాళ్ళలో నేను ఒకణ్ణి.నా యీ "సాహితీ కిరణాలు" ద్వారా సమాజంలోని తమస్సును తొలగించి ఉషస్సును కలిగించాలన్నదే నా లక్ష్యం. ఈ పుస్తకం సమాజానికి ఏ మాత్రం పనికి వచ్చినా నారచనాధ్యేయం నెరవేరినట్లే. ఈ పుస్తక ప్రచురణార్థమై ఆర్థిక సహాయమునందించిన శ్రీ రాజ రాజేశ్వర స్వామి దేవస్థానము వేములవాడకు, అందుకు సహకరించిన వేములవాడ దేవాలయం కమేటి అధ్యక్షులు శ్రీ వి. మోహన్‌రెడ్డి గారికి—

ఈ పుస్తకం అచ్చువిషయంలో విరాళాలనిచ్చిన సహృదయులందరికి, విరాళాల సేకరణలో సహకరించిన ప్రతి ఒక్కరికిఆత్మీయంగా ఆదరించి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ ఒపెన్ యునివర్సిటీ వైస్ చాన్స్‌లర్, ఆధునికాంధ్రకవి మూర్ధన్యులు పద్మశ్రీ డా॥ సి. నారాయణరెడ్డి గారికి- ఈ పుస్తకం అచ్చువిషయంలో మొదటి నుండీ నాకన్నివిధాల సహకరిస్తూ అభిమానంతో తమ ఆకాంక్షను తెలియజేసిన శ్రీ జి. వెంకటరెడ్డి మండలాభివృద్ధి అధికారి పంచాయతి సమితి సిరిసిల్ల గారికి- నా ప్రగతిని కాంక్షిస్తూ తమ అమూల్యమైన కోరికను తెలిపిన శ్రీ బుడ్డిగ సుబ్బారాయన్ కార్యదర్శి ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ హైదరాబాద్ గారికి- సాహితీ దినకరుడిగా నేనెంతో ఎదుగాలని ఆశించే చక్కని మనసున్న చొక్కాపు వెంకటరమణ ఇ చార్జ్ ఎడిటర్ బాల చంద్రిక, బాలల అకాడమీ హైదరాబాద్ గారికి- ముఖచిత్రాన్ని భావయుక్తంగా గీసి ఇచ్చిన చిత్రాకారుడు ఆనంద్ హైదరాబాద్ గారికి, పుస్తకాన్ని అందంగా అచ్చువేసి ఇచ్చిన నారాయణ ప్రింటింగ్ ప్రెస్ సిరిసిల్లా వారికి, ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించిన ప్రతి ఒక్కరికి—

తరచయితగా నా అభివృద్ధిని కాంక్షిస్తూ ఎల్లప్పుడు నాకండదండలుగా ఉండే మిత్రులందరికి—

నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు

— ఎర్రోజు సత్యం

## *గేయములు*

## పదరా తమ్ముడా పదరా!

పదరా తమ్ముడు పదరా
ప్రగతి పథాన పదరా
నిరాశ నిస్పృహ నీకేలరా
ఉత్సాహముతో సాగాలిరా ॥పదరా॥

అశక్తుడనని మూలన బడుట
అవివేకికి అలవాటురా
శక్తిపరుడనని శరవేగంతో
పరుగిడువాడే వివేకిరా ॥పదరా॥

సోమరితనమును పెంచావంటే.
పాడైపోవును జీవితము
అసమర్థుడివై జీవించితివా
దేశానికెంతో నష్టము ॥పదరా॥

ఆరోగ్యంతో హాయిగ ఉంటూ
ఆనందం చిలికించాలి
శక్తిని యుక్తిని పెంచుకొనీ
క్షణం క్షణం పైకెదగాలి ॥పదరా॥

ఉత్తేజంతో పరిశ్రమిస్తూ
ఉన్నత శిఖరాలెక్కాలి
త్యాగం ధర్మం పెంచుకొనీ
దేశఖ్యాతి నిలబెట్టాలి ॥పదరా॥

## సాగి పొమ్మ ముందుకు

ధనముకోరి మానవుడా
దానవుడవు ఎందుకు?

దగాచేయు ధనము వదలి
సాగవలెను ముందుకు ॥ధనము॥

పరుల మేలు కోరలేని
పాడు బ్రతుకు ఎందుకు?
స్వార్థ పరత విడిచి పెట్టి
సాగి పొమ్ము ముందుకు ॥ధనము॥

ఈర్ష్యాద్వేషములు గలిగి
ఇలలో బ్రతుకెందుకు?
సర్వమానవాళి సుఖము
కోరిపాగు ముందుకు ॥ధనము॥

మంచితనం పెంచలేని
మనిషి బ్రతుకు ఎందుకు?
సత్కార్యం జేస్తు నరుడు
సాగవలెను ముందుకు ॥ధనము॥

## చక్కనైన చిన్నదానా!

చక్కనైన చిన్నదానా
చందమామ లాంటిదానా
కలలో నాకు కనిపించి
కథలెన్నో చెప్పినావు ॥చక్క॥

పాటలెన్నో పాడి పాడి
పరవశింప జేసినావు
ఆటలెన్నో ఆడి ఆడి
ఆనందం పంచినావు ॥చక్క॥

చిలిపినవ్వులను చిలికి
తలపులెన్నో రేపినావు

చెంతచేరి నిలిచి నీవు
వింతలెన్నో జేసినావు ||చక్క||
కళ్ళతోటి సైగజేసి
కవ్విస్తూ పిలిచినావు
పెదవిని పంటితొనొక్కి
ముదమును కలిగించినావు ||చక్క||
వంపు సొంపు లన్ని జూపి
వహ్వా అని పించినావు
చిత్రమైన చేష్టలతొ
చిత్తము నలరించినావు ||చక్క||

## మంచి వారికేయాలి ఓటు

వేయాలి వెయాలి ఓటు
మంచి వారికేయాలి ఓటు
విలువైనది విలువైనది ఓటు
విచారించి వేయకుంటె చేటు ||వేయాలి||
ఏదో పోనీ అంటూ
ఎవరికొ ఓటును వేస్తే
ఎంతో నష్టము కలుగును
దేశప్రగతి కుంటుపడును ||వేయాలి||
నోటుకాశపడి నీవు
ఓటును వేశావంటె
నోట్లోన దుమ్ము కొట్టి
పాట్లెన్నో కలిగింతురు ||వేయాలి||
మాయమాటలను జెప్పేవారి
మర్మమును దెలిసి

ఎర్రోజు సత్యం

ఓటు వేయకుండ వారి
నోడించి తీరాలి ॥వేయాలి॥

ప్రజల మేలు కోరువారు
ప్రజ్ఞ కలిగియున్న వారు
వారె మంచి నాయకులు
నీ ఓటుకు తగినవారు ॥వేయాలి॥

## అంత కోపము ఏలనో!

అందమైన చిన్నదానా
అంత కోపము ఏలనో
అలుకమాని కరుణబూని
చెంత చేరవదేలనో ॥అంద॥

పువ్వులేమొ విరిసెను
నీ నవ్వులై అవి వెలసెను
వెన్నెలేమొ కురిసెను
నీ వన్నెలై అది మెరిసెను ॥అంద॥

తీగె ఏమొ కదిలెను
నీ ఊగె నడుమును తెలిపెను
హంస ఏమొ నడచెను
నీ నడకలను అది చూపెను ॥అంద॥

కోకిలేమొ కూసెను
నీ పాట మధురము తెలిపెను
నీతో స్నేహము చేతును
నీ కోపమును తొలగింతును ॥అంద॥

లోన ప్రేమను దాచుకొంటూ
పైకి కోపము చూపకు

కరుణ నాపై ఎంతో ఉన్న
ఎతినముగ మాట్లాడకు ॥ అంద ॥

## జీవితమంటే సుఖమని—

జీవితమంటే సుఖమని
కలనైనా తలచకోయ్
కష్టసుఖాల కలయికె
జీవితమని తెలియవోయ్ ॥ జీవి ॥

కష్టాలకు వెరవబోకు
సుఖాలకు మురిసి పోకు
కష్టసుఖాలను రెంటిని
ఇష్టంతో స్వీకరించు ॥ జీవి ॥

దారిలోన ఎత్తు పల్లములు
ఉన్నవి తెలుసుకో
దినముకు చీకటి వెలుగులు
ఉన్నవని తలచుకో ॥ జీవి ॥

పల్లమును దాటితేనె
ఎత్తు చేరు కుంటావు
చీకటిని ఓర్చుకుంటె
వేకువను కంటావు ॥ జీవి ॥

అవమానాలను సహించి
అభినందన లందాలి
కష్టాలను అనుభవించి
సుఖాలను పొందాలి ॥ జీవి ॥

## చావు గూర్చి తలచుకో

స్వార్థ పరుడ స్వార్థ పరుడ

చావు గూర్చి తలచుకో
చనిపోయే నాడు నీతో
ఏదిరాదు తెలుసుకో ॥స్వార్థ॥
వడ్డీలకు వడ్డీలాగి
గడ్డి తింటు బ్రతుకేవు
పరకులన్ని కల్తిజేసి
చాలవష్ట పరచేవు ॥స్వార్థ॥
మంచితనం మంటగలిపి
వంచనలెన్నో జేసి
ధనము చాల నార్జిస్తూ
దానవునిగ బ్రతుకేవు ॥స్వార్థ॥
నీవు పోయెనాడు నీతో
నీ వడవడి వస్తుంది
పరలోకంలో నీకది
ప్రతి ఫలమును ఇస్తుంది ॥స్వార్థ॥
నీవు జేసుకున్న మంచి
నిన్నే రక్షిస్తుంది
నీవు జేసుకున్న చెడు
నిన్నే శిక్షిస్తుంది ॥స్వార్థ॥

## చెప్పేడు మాటలు నమ్మి

చెప్పుడు మాటలు నమ్మి
చెడిపోకు తమ్ముడు
నిజానిజాలు తెలిసి
నిదానంగ సాగాలి ॥చెప్పుడు॥
మంచి స్నేహితుల మధ్య

వంటలు రేపాలవేడి
చెడుబుద్ధితో దుర్మార్గులు
చెడుమాటలు చెప్పేదరు ||చెప్పుడు||

చెప్పుడు మాటలు వింటె
స్నేహాలు చెడిపోవును
చెప్పుడు మాటలు వింటె
తప్పు పనులు చేసెదవు ||చెప్పుడు||
నీవు విన్న మాటలే
నిజమని తెలుసుకో
నీవుకన్న నడకలే
నిజమని తలచుకో ||చెప్పుడు||

చాడీలు చెప్పునట్టి
చవటల దరి రానీయక
తగిన శాస్త్రి చేయాలి
మంచినడక తెలపాలి ||చెప్పుడు||

## *జానపద గేయాలు*

## చదువు రాక పోతె—

చదువు రాక పోతె ఎన్నో కష్టాలు నష్టాలు కలుగుతాయి. చదువు నేర్చు కుంటె విజ్ఞానం పెంచుకొని ఎన్నో సుఖాలు పొందవచ్చునని ప్రబోధించే గేయమిది.

తెలుసుకో ఊరన్నా తెలుసుకో మంచిమాట
చదువు రాక పోతె మనకు చాల నష్టమున్నది
చదువు నేర్చు కుంటె అబ్బ చాల లాభమున్నది ||తెలు||
చదువు రాక పోతె అయ్యో కారటు చదువరాదు
రోజు పనికచ్చేటి లెక్కలు దియ్యరాదు

ఎవలెట్లా జెప్పితే ఆట్ల ఇనాలె
ఎంత మోసము జరిగిన అనుభవించాలె ॥తెలు॥

చదువచ్చిందంటె మనకు కారటు చదువ త్తది
రోజు పనికచ్చేటి లెక్కలు దియ్యొస్తది
ఎవలన్న మోసం జేస్తే దెలుసుకోవచ్చు
చదువస్తే అన్యాయం అనగ దొక్కచ్చు ॥తెలు॥

చదువు రాక పోతె ఎంతో అజ్ఞానం ఉంటుంది
చదువచ్చిందంటె ఎంతో విజ్ఞానం కలుగుతుంది
చదువు నేర్చుకుంటె ప్రపంచాన్ని దెలుసుకోవచ్చు
విజ్ఞానం పెంచుకొని సుఖములెన్నొ పొందవచ్చు ॥తెలు॥

చదువు రాని పెద్దోల్లకు సర్కారోలు ఇపుడు
రాత్రి బడి వెట్టిండ్రు చదువు కొమ్మంటుండ్రు
రాత్రి బడికి పోయి బాగ చదువుకోవాలె
చదువుకోని తెలివిగ బతుకు చుండాలె ॥తెలు॥

పొల్లగాండ్లుంటె పొద్దుగాల బడికి దోలాలె
బాగ చదువు నేర్పి వాల్ల బతుకు బాగు జెయ్యాలె
పొలగాండ్లకు సర్కారోల్లు వయ్యలిస్తుండ్రు
అంతేగాదు లేనోల్లకు రూపాయలిస్తుండ్రు ॥తెలు॥

## పది శేరెలుంటె జాలు

పెద్ద పెద్ద కోరికలు కోరుతూనే అంతకన్న ఎక్కువ అసలె వద్దు అంటుంది చలాకి భార్య ఆమె ఎంతో ఎక్కువగా కోరుతుందో అంత తక్కువగా కోరుకుంటూ ఉన్నంతలో సుఖపడాలి ఆశ లెక్కువ ఉండవద్దు అని భార్యకు హితవు చెప్తాడు భర్త. నిజమే కోరికలే దుఃఖానికి మూలకారణం గదామరి!

భార్య:- పదిశేరెలుంటె జాలు పది రైకెలుంటె జాలు

అంతకన్న ఎక్కువ అసలె వద్దు నాకు ॥అంత॥

భర్త :- పది శీరెలెందుకే పది రైకెలెందికె
రెండు శీరెలుంటె జాలు రెండు రైకెలుంటె జాలు
॥రెండు॥

భార్య:- అరువై తులాల బంగారు నగలు జాలు
అంతకన్న ఎక్కువ అసలె వద్దునాకు ॥అంత॥

భర్త:- అరువై తులాల బంగారు నగలు ఎందుకే
పుత్తె వుంటె జాలు అదే పది వేలు ॥పుత్తె॥

భార్య:- ఆరు బంగ్లాలు జాలు మూడు ఇండ్లు జాలు
అంతకన్న ఎక్కువ అసలెవద్దు మనకు ॥అంత॥

భర్త:- ఆరు బంగ్లాలెందుకే మూడు ఇండ్లు ఎందుకె
మన మిద్దరముండుటకు చిన్న గుడిసె జాలు ॥మన॥

భార్య:- ఒక లక్ష నగదు పడి వుంటె జాలు మనకు
అంతకన్న ఎక్కువ అసలె వద్దు మనకు ॥అంత॥

భర్త :- ఒక లక్ష నగదు పడి వుండు టెందుకే
అప్పు సొప్పు లేక ఉంటె అదే పది వేలు ॥అప్పు॥

భార్య:- కొడుకులు బిడ్డలు పది మంది జాలు
అంత కన్న ఎక్కువ అసలె వద్దు మనకు ॥అంత॥

భర్త:- పది మంది సంతానం పనికి రాధె మనకు
ఇద్దరుంటె జాలు ఇంటి కెంతొ మేలు ॥ఇద్ద॥
మంచి గుణంతో ఉంటూ మంచి పేరు దెచ్చు కుంటు
ఉన్నంతలో సుఖపడాలె సంబరంతొ ఉండాలె
ఆశలెక్వ ఉండద్దె అలి నామాట వినవె ॥ఆశ॥

భార్య:- నీ మాట నిజ మంట నువ్వు జెప్పినట్లు వింట
మంచి గుణంతో ఉంటూ మంచి పేరు దెచ్చుకుంటు

ఉన్నంతలో సుఖపడదాం సంబరంతో మనముందాం
ఆశలెక్కువ మనకద్దు ఆ పైన దుఃఖమద్దు ॥ఆశ॥

గిప్పుడా గిప్పుడా నీ రాకడ-

త్రాగుబోతు భర్తతో జరిగే అవమానం భరించ లేక తల్లి గారింటికెళ్తానని బెదిరిస్తుంది భార్య. ఆమె అలా బెదిరించ గానే ఆ భర్త బెంబేలు పడిపోయి త్రాగుడు మాని వేసి నీవు చెప్పినట్లు నడుచుకొని మంచి పేరు తెచ్చుకుంటానని మాటిస్తాడు.

ఆమె:- గిప్పుడా గిప్పుడా నీ రాకడ
మామా గుప్పు మనీ వాసనచ్చె గంత తాగుడా

అతడు:- అవ్వతోడు కొంచమే దీసుకున్ననే
ఆదెవడో దోస్తుగత్తె పోసుకున్ననె బొట్టు బోసు కున్ననే

ఆమె:- నిత్తె నిత్తె గట్లనే జెప్పుతావురో నీ తంతు మాట లను నమ్మ బోనురో
కల్లు ధాగితె నాకు ఇల్లు యాది ఉండదది- పిల్ల జెల్ల
గాండ్ల మాట అసలె పట్టి ఉండదె ॥గిప్పు॥

ఆమె:- కల్లు బాగ దాగి దాగి ఇల్లు అమ్ముకుంటివి
ఇల్లు గాదు బాకీల కుప్ప జేసి పెడితివి
బాకీల కుప్ప గాదు పానాల్కికి జెడితివి ॥గిప్పు॥

ఆమె:- కల్లు దాగితె నీకు సోయిల్ల సుద్ది ఉండది
పడుకుంటూ లేసుకుంటు ఇల్లు జేర వస్తవు
కాల్లి దప్పి ఏందేందో బాగ వొర్రుతుంటవు
పది మంది ముంగట నల్లచెక్కం జేస్తవు ॥గిప్పు॥

ఆమె:- బీరు బ్రాండి సీసాలకు లెక్కలేదురో
నల్ల దల్లును నీవు నీల్లోలె దాగుతవు

తెల్ల గల్లు బింకీలను మటుమాయం జేత్తవు
తాగనను కుంటనే తాగుతావురో
నీ మాటలు నమ్మ నా తరంగాదురో
నే సవ్వగారి ఇంటి కెల్లి బతుకుతానురో ॥నేసవ్వ॥

అతడు:- అవ్వ తోడె అయ్య తోడె నీ తోడె నా తోడె
ఇక నుండి అసలు నేను కల్లు ముట్టుకోనె
తాగుడు వల్ల ఎన్నో నష్టాలున్నాయె
నువ్వు జెప్పినట్లు నేను నడుచుకుంటానె
మంచి పేర్లు దెచ్చుకొని బతుకుతుంటానె
నా మాట నమ్మి నువ్వు దయజూడవె నా దగ్గరుండవె

మొగడో నా మొద్దు మొగడా!

బంగారం ఉన్నా లాభం లేదు. బంగ్లా లున్నా లాభం లేదు. ఆస్తి పాస్తు లెన్ని ఉన్నా తనను సంతృప్తి పరచ లేవు. కాని మంచి గుణం తెలిసి తేటలు పది మందిలో గౌరవంగా బతకడం ఇవే తన భర్త కుండాలని కోరుకుంటుంది ఆ ఇల్లాలు. అంతే కాదు అసమర్థుడు, మూర్ఖుడైన తన భర్త తప్పుల్ని తెలియ జెపుతూ మంచి మార్గాన నడవాలని చెబుతుంది. ఆ భర్త తన తప్పుల్ని ఒప్పుకొని భార్య చెప్పి నట్లు మంచి నడవడి నేర్చు కొంటానని మాటిస్తాడు. భార్యా భర్తలు ఒకరి తప్పుల్ని ఒకరు కప్పి పుచ్చుకొని మేం మంచి వాళ్ళం గొప్పవాళ్ళం అని చెప్పు కోవడం ఆత్మ వంచనే జాతుంది. కాని ఆలు మగలు ఒకరి తప్పుల్ని ఒకరు తెలుపుకొంట్లూ ఒకరి కొకరు సక్రమ మార్గం లో నడుపు కోవడమే గొప్ప గుణం. అలాంటి వారే ఆదర్శ దంపతులు అనబడతారు.

భార్య:- మొగడో నా మొద్దు మొగడా

ఇంగనేను నీతో ఎట్లవుందురో
మూడు సార్లు దింటవు మూలకు వంటవు
ఇంటి బయట సంగతులు నాకు వదిలి పెడ్తవు ॥మొగ॥

భర్త:- పెండ్లామో నాకేమి తక్కువా
లేరు ఎవరు నాకన్నా ఎక్కువా
అటు జూత్తె బంగులా ఇటు జూత్తె బంగులా
అరువై తులాల బంగారు నగలు వెడ్తి నీ ॥పెం॥

భార్య:- బంగారం ఉంటె ఏమి బంగ్లలుంటె లాభమేమి
సదువు లేదు సందె లేదు పదిమందిలో విలువలేదు
ఐనోడు కానోడు ఒత్తె గొడ్డె వడ్తవు
ఎవ్వల్తోడి మాట్లాడే తెలివిలేక పడి ఉంటవు
నేనచ్చి మాట్లాడ్తె నాకు పెద్ద పేరచ్చె
ఆడి గుల్లోడివి నా మెడ కెట్లా దగిలితివి ॥మొ॥

భర్త:- చదువు లేకపోతె ఏమి సందె లేకపోతె ఏమి
ఇంగిలీసు నా అంత ఎవ్వలకు రాదె
తురుకంలో నాతో ఎవరు మాట్లాడ బోరె
కవిత్వాన్ని నోటికే చదివేస్తానే
నాకు తెలియని విషయం ఏది లేదులే
పెండ్లామొ నన్ను మించినోడు లేడులే ॥పెం॥

భార్య:- ఎస్సు నో ఆల్ రైట్ అనవస్తేను
ఇంగిలీసు నీకు శాన వచ్చినట్లేనా
తుమ్ హమ్ క్యా కబ్ అనవస్తేను
తురుకం అంతా వచ్చినట్లు లెక్కనా
కాయ్ కోయ్ రాయివేయ్ అనవస్తేను
కవిత్వము నోటికి వచ్చినటేనా

తెలువ నోళ్ల ముంగట సరికితె లాభమేమి
తెలిసి నోల్లు మెచ్చేటంత తెలివి నీకు ఉండాలి
ఇకనుండీ నా ముందట బడాయీలు మానాలి
తెలిసి నోల్ల ముంగట నీ తెలివినీ జూపాలి ॥మొ॥

భార్య:- ఏ ఊరికన్న నువ్వు పోక పోక వోతెవా
ఎడ్డోనివి నువ్వు ఏమై పోతావోనని
తిరిగొచ్చేవరకు నాకు నమ్మకమే ఉండదు
ఎవల్నన్న బతిలాడి నీ వద్దకు దోలాలె
గింతశుద్ద మొద్దువు నామెడ కెట్లా దగ్గిలితివి
నువ్వు మొద్దు వవుట వల్ల నాకు చెడ్డ పేరచ్చె
పది ఊర్లను జూడాలె పది మందితో దిరుగాలె
గొప్పోల్లతో చెలిమి జేసి తెలివి పెంచుకోవాలె ॥మొ॥

భార్య:- అవ్వోడు లేడని అయ్యోడు లేడని
అత్తగారి ఎంబడి అదేపనిగ దిరుగుతవు
బామ్మర్దులు గొత్తె తిత్తె ఫర్వలేదంటవు
అల్లుడంటె కదరు లేకుంట జేసు కుంటవు
అందరిలో చులకనై నల్ల మొకం జేత్తవు ॥మొ॥

భార్య:- రూపు మంచిగ లేకున్నా గుణం మంచిగుండాలి
ధనం బాగ లేకున్నా తెలిపన్నా ఉండాలి
రూపులేదు గుణంలేదు ధనంలేదు తెలివిలేదు
ఏది లేని నీతో నేను ఎట్ల ఏగి సచ్చేది ॥మొ॥

భార్య:- ఆట లాట రాకపాయె పాట పాడరాదాయె
సైకిలెక్క రాకపాయె ఈత గొట్టరాదాయె
ఏ పనులను ధైర్యంగా జేసె తెలివి లేకపాయె
ఎండ్ల జూసిన మొగ లక్షణమొక్కటైన

లేకపాయె ॥మొ॥

భార్య:- ఎంత మొద్దువైన నామొగుడివని నిన్ను
ప్రేమ లేకున్నగాని ప్రేమ జేస్తున్నాను
పదిమందిలో గొప్పవాడివని చెప్తున్నాను
వినేవాళ్లు మీదికి ఔనన్నాగాని
నువ్వెంత దద్దమ్మవో నవ్వుతారు తల్చుకొని
కొంగను హంస అంటె నమ్మతుంద ఈలోకం
ఇకనైన తెలివి పెంచుకుంటె నాకు సంతోషం। మొ।

భార్య:- గొప్పోల్లను జూత్తె నీకు చెప్పరాని కోపం
వాళ్ళగూర్చి చెడుమాటలు చెప్పుట చెడ్డగుణం
తెలివిగల్ల మా బావను జూస్తె అసలు ఓర్వవు
లేనిపోని వెన్నొజెప్పి మనసు విరగ్గొడుతవు
ఇతరులపై ఈర్ష్యగుణం వదులుకోవాలి
పరుల బాగు కోరుకుంటు బతుకుచుండాలి ॥మొ॥

భర్త:- ఇప్పట్నుంచి ఇంట్లోన బడాయీలు గొట్టనే
చదువు సంధెలను నేర్చి తెలివి పెంచుకుంటానె
గొప్పోల్లతో చెలిమిజేసి విలువ పొందు తుంటానె
మంచిగుణం నేర్చుకొని మసలుకుంటానే
నువ్వు జెప్పినట్లు నేను నడుచుకుంటానె
పెండ్లామొ నాతప్పులు మన్నించవే నను దయజూడవె

## ఎంకితో ఎములాడ

ఎంకవ్వతో వేములవాడకు పోవాలని అతని ఉబలాటం. అంతేకాదు అప్పలు అరిశెలు నములుతూ నవ్వుతూ తుళ్ళుతూ ఆమెతో దారిన నడచి పోతుంటె అతనికి ఏమెమో అని పిస్తుందట పడచుపిల్ల అందులో పెళ్ళాడబోయె పిల్లతో ప్రయాణం చేయడ

మంటె ఎంతో మధురం.

ఎంకవ్వ నాతోటిరాయె మనం ఎంలాడ కెల్లి వద్దామె
సామాండ్లు గీమాండ్లు చక్కగా సదురుకొని
తాలాలు గీలాలు తలుపులకు శేసుకొని
వాడకట్టోల్లకు వత్తనాని చెప్పి ఇల్లుపైలెం అని
వాల్లకప్పజెప్పి ॥ఎంక॥
కతలు ఎతలు జెప్పుకుంటూ మనము
కాలి బాటన నడిసి పోదాము
కుడుకలు బెల్లము దినుకుంటు వోదాము
అప్పలు అరిశెలు నములుతూ వోదాము ॥ఎంక॥
నవ్వుతూ తుల్లుతూ నీతోటి వడుత్తుంటె
నడిసి వట్టుండదె నాకు ఎంకవ్వా
ఎంత దూరముంటె అంత మంచిగ అని
ఏమేమొ నాకు అనిపిస్తదె ఎంకవ్వ ॥ఎంక॥
ఎములాడ వాగులొ సద్దిముల్లెనుదీసి
ఎంతొ ముద్దుగ మనము ఇద్దరమె గూసుండి
నాకు నువ్వు నీకు నేను దినిపించుకొని
నాసామిరంగ కడుపూ నిండ దిందాము ॥ఎంక॥
ఇంతలోనె మనకు లగ్గం జేయుమని
మురిపించే పొల్లగాండ్లిద్దరిని ఇవ్వుమని
సల్లంగ జూడుమని రాజేశునికి మొక్కి
సంబరం పొంగగ తిరిగి వద్దము రాయె ॥ఎంక॥

## * పిల్లల పాటలు *

## బాల లోకం

బాల లోకము మాదండి-భావి పౌరులం మేమండి

మంచినడవడి నేర్చుకొని-మంచి పౌరులుగ ఎదిగెదము ॥బాల॥
వేళ తప్పక బడికి పోవుచు-గురువుల మన్నన పందెదము
పాఠాలన్ని బాగా చదువుచు-ఫస్టు మార్కులను పొందెదము బా॥ల॥
రోజురోజుకు తెలివి పెంచుకొని-రోజాల వికసించెదము
గాంధీ నెహ్రూ చూపిన బాటలో-అందరమొకటై నడిచెదము
॥బాల॥
ఇంటా బయట మంచి పేరుతో-ఎంతగానో రాణించెదము
జన్మభూమికి సేవచేయుటకు-చక్కగ ఎదుగుతు సాగెదము ॥బాల॥

## మంచినడవడి

అమ్మానాన్న చెప్పిన పనులను-ఆనందంతో చేస్తాను
పెద్దలు చెప్పిన మంచి మాటలను-శ్రద్ధతో నేను వింటాను
గురువు చెప్పిన పాఠాలన్నీ-మరువక మరి మరి చదివెదను
మంచినడవడి నేర్చుకొని-మంచిపేరును పొందెదను

## ఒకటి రెండు అందాము

ఒకటి రెండు అందాము-ఓపికతో మనముందాము
మూడు నాలుగు అందాము-ముద్దుల నొలకుతు ఉందాము
ఐదు ఆరు అందాము-ఐకమత్యముతో ఉందాము
ఏడు ఎనమిది అందాము-కీడు చేయక ఉందాము
తొమ్మిది పది అందాము-అమ్మమాటలను విందాము

## బడికి పోయే దెందుకురా!

బడికి పోయేదెందుకురా? చదువులు నేర్చేటందుకురా
చదువులు నేర్చేదెందుకురా? జ్ఞానం పొందేటందుకురా!
జ్ఞానం పొందే దెందుకురా? ప్రగతిని పెంచే టందుకురా?
ప్రగతిని పెంచే దెందుకురా? సుఖములు పొందే టందుకురా!

## మంచి-చెడు

ఉల్లి ఏమి చేయును? లాభము కలిగించును

నల్లి ఏమి చేయును? నష్టము కలిగించును.
ఆవు ఏమి చేయును? పాలనిచ్చి పెంచును.
పాము ఏమి చేయును? కాటు వేసి చంపును.
మంచి ఏమి చేయును? మనిషిని కాపాడును
చెడు ఏమి చేయును? మనిషిని చెడగొట్టును
అందుకని మానవులు.
మంచి పెంచుకోవాలి చెడును వదిలి పెట్టాలి

## ఔన్నత్యమును పెంచుకొందుము

అమ్మా పలుకా బలుపం ఇవ్వ
ఆనందగా బడికి వెళ్ళెదను
ఇల్లు ఈగ పాఠము నేర్చి
ఈశోజెంతో మురిసిపోయెదను
ఉడుత పాఠము రేపు నేర్చుకొని
ఊయలనెక్కి ఊగెదను
ఎవ్వరితో కలహించక నేను
ఏగెదనమ్మ శ్రద్ధతో బడికి
ఐకమత్యముతో పిల్లలమంతా
ఒకేమార్గమున నడుచుకొందుము
ఓపిక గుణమును అలవరుచుకొని
ఔన్నత్యమును పెంచుకొందుము

## అందరి మెప్పును పొందాలి

బడాయి గొట్టి బాగయ్యెప్పుడు—మాటలు గొప్పగ చెప్పచుండును
చేతలలోన వెనుకే ఉండును—అందరిలోన చులకనఅగును
అందుకని మరి అందుకని,

మాటలు గొప్పగ చెప్పుట తగదు–చేతలలోన చూపాలి
నడవడి గొప్పగ ఉంచుకొని–అందరి మెప్పును పొందాలి

## దేశమును ప్రేమించాలి

చెడు అలవాట్లను వదలాలి మంచలవాట్లను నేర్వాలి
పరిశుభ్రత పాటించాలి–ఆరోగ్యంతో ఉండాలి
సత్యమునెప్పుడు పలకాలి–స్వార్థబుద్ధులను వీడాలి
భూతదయను కలిగుండాలి–అహింసను పాటించాలి
పెద్దల గౌరవించాలి–తల్లిదండ్రుల పూజించాలి
కోరిక లెక్కువ కోరద్దు–దురాశ చేటని మరవద్దు
దుబార ఖర్చులు చెయ్యొద్దు–పొదుపు చేయు బ్రతుకేముద్దు
క్రమశిక్షణ పాటించాలి–శ్రమపడి పనులను చేయాలి
కాలం విలువను తెలియాలి–ప్రగతినెంతో సాధించాలి
చదువులు బాగా చదువాలి–సంస్కారమును పెంచాలి
దేశమును ప్రేమించాలి–మంచివారిమై బ్రతుకాలి

## *వచన కవితలు*

## భగవాన్!

భగవాన్! నన్ను కరుణించు–నాకోరికల్ని మన్నించు
ఓ భగవాన్! నీతో రత్నాలుకావాలని కోరుకోను
రాజ్యాలు ఏలాలని వేడుకోను
నూరేళ్ళు బ్రతుకాలని ప్రార్థించను
సుఖంగా జీవించాలని అర్థించను
ఎన్ని కష్టాలైనాసరే సంతోషంగా అనుభవించే శక్తిని ప్రసాదించు
అవమానాలను అభినందనలను జయాపజయాలను ఆనందంగా స్వీకరిస్తూ
జీవితాన్ని తీర్చిదిద్దుకునే ఆత్మ స్థైర్యాన్ని అందించు

వంచకులను అణచడానికి మంచిని పెంచడానికి దృఢనిశ్చయం
కలిగించు

పేదవారి బాధల్లో పాలుపంచుకునే భాగ్యాన్ని ప్రసాదించు
మూడుకోటులు బ్రతికినాసరే ముచ్చటైన రత్నంలా వెలిగించు
నాలో జ్ఞానజ్యోతిని వెలిపి మంచిని మమతను పెంచు.

## ఈనాడు

ఈనాడు ప్రతీ వ్యక్తి-కావాలి మహాశక్తి
పెంచుకోవాలి యుక్తి-కలిగి ఉండాలి శక్తి
చెప్పాలి అవినీతికి స్వస్తి-చేయాలి వంచకులకు తగినశాస్తి
పెంచాలి నీతిని జాస్తి మంచితనమేకదా మనిషికి ఆస్తి

## బడాయిల పోశెట్టి

అందరు అంటారు నన్ను బడాయిల పోశెట్టి
ఎందుకలా అంటారని ఆలోచించాను పట్టుబట్టి
ఇంట్లో భార్యముందు ఏమీ తెలియని వారి ముందు
బడాయిలు కొడుతా నెప్పుడు
గొప్పవాళ్ళముందు మాత్రం చేయను చలీ చప్పుడు
అన్నిభాషలు అమోఘంగ వస్తాయంటాను
ఏ భాష సరిగా రాక కుమిలి కుమిలి ఏడుస్తుంటాను
కవిత్వం వ్రాయడం గొప్పతనం కాదంటాను
కవిత వ్రాయబోయి భావం రాక కాళ్ళు చేతులు పీక్కుంటాను
పాటలు పాడడం గొప్పతనం కాదంటాను
పాటపాడి శ్రోతల్ని పరుగు తీయిస్తాను
నటించడం చెప్పదగిన విషయం కాదంటాను
నటన చేయబోయి నవ్వుల పాలౌతుంటాను
నాకన్ని తెలుసునని ఎన్నో గొప్పలు చెప్పుకుంటాను

మాటలు గొప్పగ చెప్పుట తగదు–చేతలలోన చూపాలి
నడవడి గొప్పగ ఉంచుకొని–అందరి మెప్పును పొందాలి

## దేశమును ప్రేమించాలి

చెడు అలవాట్లను వదలాలి మంచలవాట్లను నేర్వాలి
పరిశుభ్రత పాటించాలి–ఆరోగ్యంతో ఉండాలి
సత్యమునెప్పుడు పలకాలి–స్వార్థబుద్ధులను వీడాలి
భూతదయను కలిగుండాలి–అహింసను పాటించాలి
పెద్దల గౌరవించాలి–తల్లిదండ్రుల పూజించాలి
కోరిక లెక్కువ కోరద్దు–దురాశ చేటని మరవద్దు
దుబార ఖర్చులు చెయ్యొద్దు–పొదుపు చేయు బ్రతుకేముద్దు
క్రమశిక్షణ పాటించాలి–శ్రమపడి పనులను చేయాలి
కాలం విలువను తెలియాలి–ప్రగతినెంతో సాధించాలి
చదువులు బాగా చదవాలి సంస్కారమును పెంచాలి
దేశమును ప్రేమించాలి–మంచివారిమై బ్రతుకాలి

***వచన కవితలు***

## భగవాన్!

భగవాన్! నన్ను కరుణించు–నాకోరికల్ని మన్నించు
ఓ భగవాన్! నీతో రత్నాలుకావాలని కోరుకోను
రాజ్యాలు ఏలాలని వేడుకోను
నూరేళ్ళు బ్రతుకాలని ప్రార్థించను
సుఖంగా జీవించాలని అర్థించను
ఎన్నికష్టాలైనాసరే సంతోషంగా అనుభవించే శక్తిని ప్రసాదించు
అవమానాలను అభినందనలన్ను జయాపజయాలను ఆనందంగా స్వీకరిస్తూ
జీవితాన్ని తీర్చిదిద్దుకునే ఆత్మ స్థైర్యాన్ని అందించు

వంచకులను అణచడానికి మంచిని పెంచడానికి దృఢనిశ్చయం
కలిగించు
పేదవారి బాధల్లో పాలుపంచుకునే భాగ్యాన్ని ప్రసాదించు
మూటకోజులు బ్రతికినాసరే ముచ్చటైన రత్నంలా వెలిగించు
నాలో జ్ఞానజ్యోతిని వెలిగించి మంచిని మమతను పెంచు.

## ఈనాడు

ఈనాడు ప్రతీ వ్యక్తి-కావాలి మహాశక్తి
పెంచుకోవాలి యుక్తి-కలిగి ఉండాలి శక్తి
చెప్పాలి అవినీతికి స్వస్తి-చేయాలి వంచకులకు తగినశాస్తి
పెంచాలి నీతిని జాస్తి మంచితనమేకదా మనిషికి ఆస్తి

## బడాయిల పోశెట్టి

అందరు అంటారు నన్ను బడాయిల పోశెట్టి
ఎందుకలా అంటారని ఆలోచించాను పట్టుబట్టి
ఇంట్లో భార్యముందు ఏమీ తెలియని వారి ముందు
బడాయిలు కొడుతా నెప్పుడు
గొప్పవాళ్ళముందు మాత్రం చేయను చలీ చప్పుడు
అన్నిభాషలు అమోఘంగ వస్తాయంటాను
ఏ భాష సరిగా రాక కుమిలి కుమిలి ఏడుస్తుంటాను
కవిత్వం వ్రాయడం గొప్పతనం కాదంటాను
కవిత వ్రాయబోయి భావం రాక కాళ్ళు చేతులు పీక్కుంటాను
పాటలు పాడడం గొప్పతనం కాదంటాను
పాటపాడి శ్రోతల్ని పరుగు తీయిస్తాను
నటించడం చెప్పదగిన విషయం కాదంటాను
నటన చేయబోయి నవ్వుల పాలౌతుంటాను
నాకన్ని తెలుసునని ఎన్నో గొప్పలు చెప్పకుంటాను

ఏదీ తెలియక ఎంతో అవస్థ పడుతుంటాను
అందుకే అంటారునన్ను బడాయిల పోశెట్టి
ఆపేరు పెట్టినవారినోట్లో పంచదార పోయాలి దొరకవట్టి

## బ్రతుకే శూన్యం!

నేస్తం! నీవు బ్రతుకాలంటే డబ్బు అవసరమే
నిరాడంబరంగా బ్రతుకుతూ నీ అవసరాలకు తగినంత డబ్బును
నీతిగా సంపాదించు నిజాయితిగా జీవించు
కాని మనిషి పుట్టింది కేవలం డబ్బు సంపాదిస్తూ
అనేక సుఖాల్ని అనుభవించడానికేనని మాత్రం అనుకోకు
మనిషి ఎన్నో కాని పనుల్ని చేస్తూ
ఎంతడబ్బైనా సంపాదించవచ్చు-అది గొప్పతనంకాదు
మనిషి మంచితనాన్ని మంటగలపి
ఎన్ని సుఖాలైనా పొందవచ్చు అది మానవత్వంకాదు
మనిషి చదువు సంస్కారం గౌరవం సంపాదించుకొని
నిర్మలంగా బ్రతుకాలి అదే గొప్పతనం
మనిషి మంచి పనుల్ని చేస్తూ నిరంతరం దేశసేవ చేయాలి
అదే మానవత్వం
మంచిని పెంచని మనిషి గౌరవంగా బ్రతుకని మనిషి
ఎంత డబ్బు సంపాదించినా వ్యర్థం-అతని బ్రతుకే శూన్యం

## సద్గుణం పెంచుకో

తమ్ముడూ! నీ తోటివాడు మంచివాడనీ గొప్పవాడనీ
పదిమందిచే ప్రశంసింపబడుతూ ప్రగతిని సాధిస్తున్నప్పుడు
అతని అభివృద్ధిని చూసి ఓర్వలేక ఈర్ష్యాద్వేషాలతో
అతని ప్రతిష్ఠపాలు చేయాలని అతనిగూర్చి దుష్ప్రచారం చేయకు
అతని ప్రగతికి అడ్డునిలవాలని ప్రయత్నించకు

నీ సంకుచితపు స్వభావాన్ని తెలుపుతూ నీచుడివని నిరూపించుకోకు
గొప్పవారిని నువ్వెంత అవమాన పరచాలని ప్రయత్నించినా
వారికీర్తి తరుగదు—ఇంకా పెరుగుతుంది
గొప్పవారి ప్రగతినాపాలని సైంధవునిలా నువ్వెంతగా
అడ్డునిలిచినా
వారి ప్రగతి ఆగదు ఇంకా ఎదుగుతుంది
కాని నీవుమాత్రం ఇతరుల మంచిని గొప్పను చూచి
ఓర్వలేని వాడివని, అన్యాయ పరుడివని, అవివేకివని
లోకంచే గుర్తింప బడతావు దుష్టుడిలా మిగిలి పోతావు
అందుకని, నీకన్నా గొప్పవారిని చూసి ఈర్ష్యాద్వేషాలు మానుకో
పరులబాగునుచూచి ఓర్చే సద్గుణం నీలో పెంచుకో
అదినీకుమంచిది నీ ఆరోగ్యానికి మంచిది.

## వెలిగించు

మిత్రమా! నీ చుట్టూ నీ తోటివారిచుట్టు చిమ్మ చీకట్లు
వ్యాపించాయికదూ!
అయితే నీవు ఆ చీకట్లను తొలగించాలి వేకువను కలిగించాలి
ఆ చీకట్లు కిరసనాయిల్ దీపాలకు తొలగి పోవు
కరంటు దీపాలకు తరలిపోవు
మరి ఆ చీకట్లను ఎలా చీల్చి చెండాడాలో
ఎలా రూపుమాపాలో చెప్తాను విను
మంచితనం అను దివ్వెలో మమతా తైలాన్నిపోసి
క్షమవత్తిని త్యాగం అగ్గిపుల్లతో అంటించి ఆ దివ్వెను వెలిగించు
అప్పుడు ఆ చీకట్లు తొలిగిపోతాయి వెలుగు రేఖలు విజృంభిస్తాయి

## *మంగళ హారతి పాటలు*

1వ పాట పూజాఫలం చిత్రంలో పగలే వెన్నెల
జగమే ఊయల అనువరుస)

సత్యనారాయణా మా పాలిదైవమా
మంగళ హారతివి గైకొనరావా

నిత్యము నిను మరువకుండ తలచెదమయ్యా
సత్యవ్రతము చేసి శాంతి పొందెదమయ్యా
నీ వ్రత మహిమలు ఎంతో గొప్పవిలే
కష్టములను బాపి సుఖము లిచ్చులే

సాధువనే వైశ్యుడొకడు సంతు కలిగితే
సత్యవ్రతము చేతునని ప్రతిజ్ఞచేసే
సంతు కలిగినా వ్రతము మరచెను
ఎన్నో కష్టములను అనుభవించెను

లీలావతి భక్తితో నీ వ్రతము చేసే
భర్త కష్టములు బాపి సుఖములు పొందే
నీ వ్రతమును చేసి సుఖములు పొందుచు
కలియుగమున భక్తులు తరియింతురయా

నీ వ్రతమును చూస్తేచాలు పుణ్యము కలుగు
నీ ప్రసాదములు తింటే బాధలు తొలుగు
నీ వ్రత మహిమలు ఎంతో గొప్పవిలే
శ్రీహరివేనీవు సత్యదేవుడా

(2వ పాట ఇలవేలుపు చిత్రంలో చల్లనిరాజా ఓచంద మామ
అను వరుస)

తిరుమలవాసా ఓ శ్రీనివాసా
మము కరుణించి కాపాడు ఓ శ్రీనివాసా-మా శ్రీనివాసా ॥తిరు॥

కలియుగమున వెలసిన దైవానివి భక్తుల పాలిటి కల్పవృక్షానివి
నినుకొలచేమయా మము కరుణించవా-మా ఇలవేలుపు
నీవేనయా ॥తిరు॥

నిను తలచిన కష్టాలు తీరేనయా-నిను కొలచిన పాపాలు తొలగేనయా
కరుణామయుడవు దేవదేవుండవు-భక్తుల కోర్కెలు మన్నింతువు ॥తిరు॥
పిలచిన పలికె దేవుడవు నీవేనయా-ఆపదా మ్రొక్కులవాడ దయ జూడవా
నీ పాదాలనే నమ్మి యున్నామయా-నిరతము మమ్ముల కాపాడుమా ॥తిరు॥

(3వ పాట ఆత్మ గౌరవం చిత్రంలో రానని లేనని అనువరస)
రా అనీ రారా అనీ నిన్ను పిలచేను
రావాలనుకొని భక్తుని మొరవిని శంకర రావయ్యా ॥రా అనీ॥
మంగళారతి గొనుము-నాపై దయజూపుము
నిన్ను నమ్ముకున్న నాకు-శుభము లొసగుము
పగలైనా రేయైనా నిన్నే కొలతును ॥రా అనీ॥
నాగులను ధరించిన నాగేశ్వర రారా
శివశంకర నిను వేడగ నన్ను బ్రోవవేర
దేవతలకు దేవుడవు నీవే అంటాను ॥రా అనీ॥
కాశిలోన వెలసిన విశ్వేశ్వర రారా
భక్తితో నిను పూజింతును నన్ను ఆదుకోర
నీవు తప్ప నాకు ఎవరు లేరు అంటాను ॥రా అనీ॥

(4వ పాట సువర్ణ సుందరి చిత్రంలో పిలువకురా అలుగకురా అను వరుస)
పిలిచితిమీ కొలచితిమీ-శారద నిన్నే వేడితిమీ
మంగళహారతి గైకొనుమీ ॥పిలి॥
భక్తితో నిను ధ్యానించెదమమ్మా-విద్యల నొసగి —

అన్ని కళలకు నిలయము నీవే-కరుణించి జ్ఞానం మాలో
పెంచుము జననీ ॥పిలి॥

రారాజులైనా దేవతలైనా ఆఆ కళా కారులను గౌరవింతురు
లలితకళలను మాలో నిలువుము నిరంతరము నిన్నే
వేడు కొందుము జననీ
త్యాగయ పోతన నీదయవలన ఆ ఆ-రాముని ప్రేమను
పొందిరిగాదా
కవులకు విలువను పెంచేదేవి-కరుణించి కవితా శక్తి మాలో
పెంచు జననీ ॥పిలి॥

(5వ పాట ఇద్దరు మిత్రులు చిత్రంలో ఖుషీ ఖుషీగా నవ్వుతూ
అనువరుస)

నిరతము నిన్నే వేడుతూ-రక్షించుమనీ కోరుతూ
మంగళహారతి నందించెదము వీర అంజనేయా
సీతమ వెదుకగ ఏడు సంద్రములు దాటిపోయిన హనుమంతా
సీతనుకనుగొని లంకాదహనం చేసి వచ్చితివి బలవంతా ॥నిర॥

యుద్ధముచేయగ మూర్ఛకులోనై నేల కూలెను లక్ష్మణుడు
లక్ష్మణ అంటూ ఎంతో దుఃఖము పాలై పోయెను రాముడు.
సంజీవిని తెచ్చివేగమే లక్ష్మణుని రక్షించితివి
రాముని ప్రేమను ఎంతో పొంది ధన్యజీవిగా నిలిచితివి ॥నిర॥

కొండగట్టు శిఖరాన వెలసిన హనుమాన్ దయతో చూచుకో
కష్టసుఖాలలో నిన్ను కొలతుము మమ్ములకాచి ఆదుకో
శక్తిని యుక్తిని మాలో పెంచి ధైర్యముగా బ్రతికించవయా
మంచీ మమతలు మాలో నిలిపి మంచి పనులు చేయించుమయా
॥నిర॥

## * నీతి కథలు *

## పాపం! సుబ్బారావు

ఆఫీసులో గుమస్తా ఉద్యోగం చేస్తున్న సుబ్బారావు తెలివి తేటలు లేని అసమర్థుడు. ఐనా తనకన్న గొప్పవారు, మంచివారు ఎవరు లేరనుకునే మూర్ఖుడు. మంచివారిని, గొప్ప వారిని చూస్తేవారిపై ఈర్ష్యా ద్వేషాలు పెంచుకొని వారి గూర్చి దుష్ప్రచారాలు చేస్తూ వారికి చెడ్డ పేరు తేవాలని ప్రయత్నించే నీచుడు. బంధువులు, స్నేహితులు అతగాడిని పిచ్చి సుబ్బారావని చవట అని, మూర్ఖుడని ఇంకేమేమో అను కొంటూ ఉంటారు. ఎదురుగా మాత్రం చాలా గొప్పవాడివని, మంచి వాడివని పొగడుతూ సుబ్బారావు ద్వారా ఎన్నో లాభాలు పొందుతూ ఉంటారు.

సుబ్బారావు తనను మంచివాడివని, గొప్పవాడివని ఎవరైన అంటేచాలు అలా అన్నవారి మాటలు అక్షరాల నిజమేనను కొని తనను పొగడిన వారికి ఏదంటె అది ఇస్తాడు. ఎంత సేవైనా చేస్తాడు అది అతడిలోని బలహీనత.

"అల్లుడూ! నీలాంటి మంచి అల్లుడు ఈ ప్రపంచంలో ఎవరు లేరు మీ అత్తగారి చీరెలు, నా అంగీలు ధోవతులు ఉతికి ఇస్తిరి చేయాలి" అని మామ గారు చెప్పగానె అతి వినయంగా ఆ పనుల్ని చేసి పెడతాడు సుబ్బారావు.

"బావా నీ వెంతో మంచివాడివి. తెలివి తేటలు కలవాడివి. మేం బొంబాయికెళ్ళాలి మా సూట్ కేసులు బస్ స్టాండువరకు పట్టుకెళ్ళాలి అన్నట్లు బస్ చార్జీలు కూడ ఇవ్వాలి' అని బావ మరుదులు చెప్పగానె తు. చ. తప్పకుండా వాళ్ళ సేవచేస్తుంటాడు. కబ్బులందిస్తుంటాడు సుబ్బారావు.

"సుబ్బారావు! నీ వెంతో ఉదారస్వభావుడివయ్యా! అడిగిన వారికి లేదన కుండా ఏదడిగితే అది ఇస్తావు. మీ ఇంట్లో వారాని కొక సారైన డిన్నర్ ఏర్పాటు చేస్తావు. నీ భార్య చేతి వంటలు బ్రహ్మాండంగా ఉంటాయి. రేపు మీ ఇంట్లో విందు ఏర్పాటు చేయాలి" అని స్నేహితులు అడుగగానే పొంగిపోతు సుబ్బారావు తన ఇంట్లో బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేస్తాడు. వచ్చిన రౌడి స్నేహితులు అతని ఇంట్లో విందు, మందు సేవించి సుబ్బా రావు భార్యతో సరస సల్లాపాలాడి మరీ వెళ్లి పోతుంటారు.

"ఏమండీ! మీలాంటి భర్తను పొందడం నిజంగా నా అదృష్టం. చాలామంది భర్తలు తమ భార్యల్ని పరువు ప్రతిష్ఠ లంటూ, సంప్రాదాయమంటూ, చచ్చు బండ లంటూ విచ్చల విడిగా తిరుగనీయరు. కాని మీరు మాత్రం ఎంతో విశాల హృదయులండి. నేనెవరితో తిరిగినా ఏం చేసినా ఏమి అనరు మగవాళ్ళంటె మీ లాగుండాలి అన్నట్లు నీ స్నేహితులైన రవి, మదు గారింటి కెళ్తాను. ఆఫీసు పనిలో నీవు చేసే తప్పుల్ని, నీ అసమర్థతను కప్పి పుచ్చుతూ నీకు అండదండగా ఉండాలని చెప్తాను. వీలైతే రాత్రికి వస్తాను లేకుంటె వారి దగ్గరే ఉండి పోతాను" అని భార్యామణి అవగానే "సరే నీ ఇష్టం నీలాంటి మంచి భార్య దొరకడం నిజంగా నా అదృష్టం నీ చలువ వల్లే నా ఉద్యోగం పోకుండా కాపాడుకుంటున్నాను ఈ రాత్రికి రావ లసిన అవసరం లేదు రేపు ఉదయం లేచిరా" అని తను ఆడవాళ్ల ను అణచి ఉంచె అవివేకిని కావనుకొంటూ భార్యామణిని మరీ సాగనంపి వస్తుంటాడు సుబ్బారావు.

ఇంతమంది తనను మంచివాడివని, గొప్ప వాడివని పొగడుతూఉంటే నిజమేవనుకొని ఎంతో గర్వంతో పొంగిపో తుంటాడు పాపం! పిచ్చి సుబ్బారావు.

నీతి:- 'అతివినయంధూర్త లక్షణం' అన్నారు పెద్దలు
అసమర్థుడై, దుర్మార్గుడై, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి, ఆత్మా
భిమానాన్ని చంపుకొని మంచీ-చెడులు తెలియకుండా నైతికంగా
గలిజారిపోయి బతికే వారి బతుకు కుక్క కన్న హీనమైన
దిబతుకు.

## బుద్ధి చెప్పిన పొలేరు

ఒక ఊరిలో రంగమ్మ, రంగనాథం అను ఆలు మగలు
ఉండేవారు. రంగనాథం అసమర్థుడైనా అతనితండ్రి లక్షల ఆస్తి
సంపాదించి ఇచ్చాడు కాబట్టి దర్జాగా బతుకు తుండేవాడు.
రంగమ్మ ధనవంతురాలినన్న గర్వంతో ఎదుటి వారిని చాల
చులకనగా చూస్తుండేది.

రంగనాథం రంగమ్మలు ఇరుగు పొరుగు వారిని, బంధు
వులను, కనిపించిన ప్రతి ఒక్కరిని, పొట్టి వాడని, తాడి చెట్టులా
పొడువున్నాడని, గుమ్మిలా బలిసి ఉన్నాడని, రాధమ్మ భర్త
దున్నపోతులా ఉన్నాడని, రాజమ్మ భర్త నెపుడు కొడుతుందని,
అశయ్య భార్య నెపుడు గజ గజ వణికిస్తూ అర చేతిలో ఆడించు
కుంటాడని, వెంకయ్య వెంకమ్మలు ఎప్పుడు కొట్లాడుకుంటూనే
ఉంటారని ఏవేవో వంకలు పెడుతూ అందరిని ఎగతాళి చేసేవారు
అంతే కాదు తమవలె అందంగా, అన్యోన్యంగా ఏ ఆలుమగలు
ఉండరని ఇరుగు పొరుగువారితో బంధువులతో ఎన్నో గొప్పలు
చెప్పుకునేవారు. నిజానికి రంగనాథం రంగమ్మలకు అసలు ఈడూ
జోడు కుదురనే లేదు. రంగనాథం మెల్లకన్నులతో, కోతిముఖం
తో, నల్లగా, బక్కగా, పొట్టిగా ఎలుక పిల్లవలె ఉంటె, రంగ
మ్మ గుమ్మివలె బలిసి ఏనుగువలె ఉంటుంది, రంగమ్మ అసమ
ర్థుడు అయోగ్యుడైన భర్తను ప్రతిరోజు తిడుతూ వారానికొక
రోజైనా కొడుతుంది. అయినాలో ధిపీఖనివారుగాని, ఆ ఊరు

లోనివారుగాని వీళ్ల గూర్చి పూర్తిగా తెలిసినా ఎవరు ఏమి అనే వారు కాదు.

రంగనాథం రంగమ్మలు ఇతరులకు డబ్బులిస్తూ, ఎన్నో సహాయాలు చేస్తూ మంచి వారి మని పించుకోవాలని, తమలోని లోపాల్ని కప్పిపుచ్చుకోవాలని ఎన్నో తంటాలు పడేవారు వాళ్ళ మూర్ఖత్వాన్ని తలచుకొని గ్రామస్థులు, బంధువులు, తెగ నవ్వుకునేవారు.

ఒకనాడు తమపాలేరైన పోచయ్యను పనిలోకి పిలిపించుకున్నారు రంగనాథం రంగమ్మలు పోచయ్య భార్య రాజవ్వ ఆరోగ్యం బాగా లేనందున ఆమె పనిలోకి రాలేకపోయింది.

"ఏరా పోచయ్యా! నీతో మీ కుంటి రాజవ్వ రాలేదా"? అని ఎగతాళిచేస్తూ అడిగింది రంగమ్మ పోచయ్య భార్య పొట్టిగా ఉంటుంది. ఒక కాలు కుంటి అందుకని రంగమ్మ హేళన చేస్తూ అడిగింది. పోచయ్యకు ఎంతో కోపం వచ్చింది ఐనా తమాయించుకున్నాడు.

"ఏరా రైలు బొగ్గు! మాట్లాడవేం నీతో మీ ఉల్లిగడ్డ రాలేదెందుకని అదే నీ భార్య ఎందుకని రాలేదు" అన్నాడు రంగనాథం నల్లగా ఉన్న పోచయ్యను అవమాన పరుస్తూ.

పోచయ్యకు అరికాలుమంట నెత్తికెక్కింది ఏమైనా సరే వాళ్ళకు తగినబుద్ధి చెప్పాలను కున్నాడు.

ఏందయ్యాగారు మీరు, అమ్మగారు ప్రతి ఒక్కరిని ఏవేవో వంకలు పెడుతూ హేళన చేస్తు ఉంటారు. అసలు మీ ఇద్దరికి ఈడుజోడు కుదిరిందా మీరే ఆలోచించుకొండి. మీ గురించి లోకులేమనుకుంటారో చెప్తాను వినండి మీరు కోతిముఖంతో, మెల్లకన్నులతో, నల్లగా బక్కగా పొట్టిగా ఎలుక పిలవలె ఉంటారని

అమ్మగారేమో గుమ్మంలా బిగిసి ముసుగుపెట్టి ఉంటుందని మీరే మాత్రం తెలివి తేటలులేని చవటలని మీ అసమర్థతను ఆసరా చేసుకొని అమ్మగారు మిమ్మల్ని మరీ చవటగా తయారు చేస్తూ విచ్చలవిడిగా తిరుగుతుందని అమ్మగారు మిమ్మల్ని రోజూ తిడుతూ వారానికొకసారైనా కొడుతుందని ఇంకేమేమో చెడ్డ మాటలు చెప్పుకుంటారండి నా నోటితో చెప్పలేనండి అన్నాడు పోచయ్య.

పోచయ్య మాటల్ని విన్న రంగనాథం, రంగమ్మ ముఖాలు చిన్నవై పాలై పోయాయి ప్రజలు తమ గురించి అంతహీనంగా మాటాడుకుంటున్నారని తెలుసుకొని వాళ్లెంతో అవమానంతో క్రుంగిపోయారు. ఇతరుల్ని ఎగతాళి చేస్తే వాళ్లెంత బాధపడతారో అర్థమైంది వాళ్ళకు.

"ఒరే పోచయ్యా నిన్ను నీ భార్యను ఎగతాళి చేసినందుకు మమ్మల్ని మన్నించాలి ఇకనుండి ఎప్పుడూ ఎవరినీ వంకలు పెడుతూ ఎగతాళి చేయం మా తప్పు మేం తెలుసుకున్నాము" అన్నారు. రంగనాథం, రంగమ్మలు.

నీతి:— కుంటివారిని, గ్రుడ్డివారిని, ఎవరినీ ఎగతాళి చెయ్యకూడదు.

## మూర్ఖులు

రవిపురం సర్పంచ్ ధర్మారావు చాలా మంచివాడు. అతడు గ్రామాన్నెంతో అభివృద్ధి పరిచి ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దాడు. అందుకని ధర్మారావును ఆ ఊరి ప్రజలు ఎంతో గౌరవిస్తారు.

రవిపురంలో జన్మించిన కవికుమార్ హైదరాబాద్‌లో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. అతడు మంచి గాయకుడు, నటుడు. అన్నిటిని మించి గొప్పకవి. అతడు రచించిన ఎన్నో రచనలు సాహిత్య అకాడమీ బహుమతులు పొందాయి. గొప్పవాళ్ళచే

ప్రశంసించబడ్డాయి. సినిమాలుగా తీయబడ్డాయి. కవికుమార్ తన తెలివి తేటలతో, రచనా శక్తితో, మంచితనంతో పలువురి మెప్పు పొందాడు. ఎంతో పలుకుబడి సంపాదించుకున్నాడు. కవికుమార్ తనకున్న పలుకుబడితో ఎన్నో గొప్పపనుల్ని సాధించాడు. ఎందరికో సహాయం చేశాడు. తన స్వగ్రామమైన కవిపురాన్ని అభివృద్ధి పరచడానికి ఎంతో పాటుపడ్డాడు. గ్రామ సర్పంచ్ ధర్మారావుకు ఎంతో సహకరించాడు. అందుకని ధర్మారావుకు కవికుమార్ అంటే ప్రత్యేకమైన గౌరవాభిమానాలు ఉన్నాయి.

రవిపురంలో జన్మించి కవిగా ఆ గ్రామానికి ఎంతో పేరు తెచ్చిన కవికుమార్‌ను సన్మానసభ ఏర్పాటు చేసి ఎంతో గొప్పగా సన్మానించాడు ఆ గ్రామ సర్పంచ్ ధర్మారావు. అది గిట్టని కొందరు పుకార్లు దుర్విమర్శలు చేశారు.

ఒకనాడు తన పొలంవైపు వెళుతున్న ధర్మారావుకు పాతబడిన ఇంట్లో నుండి కొన్ని మాటలు చెవిన బడ్డాయి. కాంతయ్య, సుబ్బయ్య, రమేష్, జగన్‌లు పాతబడిన ఇంట్లో పేకాటాడి వీరమ్మ ఇచ్చిన టీ త్రాగుతూ ఇలా మాట్లాడుకుంటున్నారు.

"ఒరే సుబ్బయ్యా! మొన్న మన గ్రామంలో ఆ కవికుమార్ గాణ్ణి సర్పంచ్ ఎందుకు గౌరవించాడ్రా?" అన్నాడు ఈసడింపుగా రోజూ పేకాటాడుతూ జోరుగా త్రాగే కాంతయ్య.

"ఆఁ ఆ ఎధవ ఏవో వయ్యాలు రాశాడట పెద్దోళ్లలో మెచ్చుకున్నారట బికారి ఎదవ ఎన్ని వయ్యాలు రాసినా ఉండటానికి ఇల్లులేదు. కట్టడానికి బట్టలేదు. తినటానికి తిండి లేదు. బంగారం లేదు. రూపాయలు లేవు. పొలాలు లేవు బికారి వెధవ" అన్నాడు ఎగతాళి చేస్తూ సుబ్బయ్య.

సుబ్బయ్యకు తండ్రి అవినీతితో లక్ష లార్జించి ఇచ్చాడు. తండ్రి ఇచ్చిన ఆ ఆస్తితో దొంగ వ్యాపారం చేస్తూ ఎన్నో లక్షలు సంపాదిస్తూ ఎవ్వరితో ముందిచ్చే తమ్ములు తింటూ అప్పుడప్పుడు జైలుకు వెళ్లి వస్తుంటాడు సుబ్బయ్య.

"ఆఁ వాడోకవినా? ఆ పుస్తకం నుండి సగం పేజీ ఈ పుస్తకం నుండి సగం పేజీ ఇట్లా ఇతరులు వ్రాసిన పుస్తకాల నుండి కాపీ చేస్తూ నేనే వ్రాశానంటాడు. నేను తల్చుకుంటే వాడి కన్నా బ్రహ్మాండంగా వ్రాయగలను. ఐనా కవిత్వం వ్రాయడం గొప్పతనమేమి కాదు కవుల్ని, రచయితల్ని గౌరవించటం అవివేకం" అన్నాడు తీసిపారేస్తు రమేష్. అతడు గుమస్తా ఉద్యోగం చేసి ఎన్నో తప్పులు వ్రాసి అసమర్థుడని నిరూపించుకొని ఉద్యోగాన్ని పోగొట్టుకొని ఇంట్లో భార్యముందు ఏమి తెలియని వారి ముందు బడాయిలు కొడుతుంటాడు.

"మొన్న సభలో కవికుమార్ గురించి. అతనికి గొప్ప వాళ్ళతో స్నేహముందని తల్చుకుంటే అతడు ఏ పనులైనా సాధించగలడని మన ఊరికెన్నో సేవలు చేశాడని చెప్పారు అవన్నీ పచ్చి మాటలు. అసలు కవికుమార్‌కు ఏ గొప్పవాళ్ళతో పరిచయము లేదు. నాకు అందరు తెలుసని నటిస్తుంటాడు. నేను కవినని ఇదిగో నా పుస్తకాలని పది మంది చుట్టు పదే పదే తిరుగుతూ గొప్పలు చెప్పుకుంటాడు. అతడేమంత గొప్పవాడని మన సర్పంచ్ గౌరవించాలి?" అంది ఎగతాళి చేస్తూ [illegible] ఆమె భర్త సోమలింగం ఏమాత్రం తెలివితేటలు లే[illegible] ఆడవాళ్ళముందు ఏమి తెలియని అమాయకుల[illegible] చెప్పుకోవడం తప్ప బయటి ప్రపంచ[illegible] గొప్పవాళ్లను ఆమె [illegible]

న తన భర్తను మరీ చవటగా తయారుచేసి హద్దుమీరిన ఆడ పెత్తనం చెలాయిస్తూ పేకాటాడే మగవాళ్ళకు టీ చేసి పోస్తూ విచ్చలవిడిగా తిరిగి డబ్బు సంపాదిస్తుంది వీరమ్మ. అసమర్థుడైన తన భర్తవలె అందర్నీ అసమర్థులే అనుకుంటుంది పాపం వీరమ్మ.

"అసలు కవికుమార్ కవిత్వం నాకు అర్థమేకాదు. అతడు వ్రాసిన కొన్ని పుస్తకాలు చదివాను అర్థం పర్థంలేని పిల్లగాండ్ల మాటలవలె ఉంటాయి అతని రచనలు తల్చుకుంటే నేను గంటలో ఒకనయ్యి వ్రాసిపారేయగలను. కవికుమార్‌ను సర్పంచ్ గారు ఎందుకు గౌరవించాలి" అన్నాడు చులకన చేస్తు జగన్. మూడుసార్లు బి. ఏ. ఫేలై ఇక పాస్ కాలేక ఏ ఉద్యోగం దొరికించుకోలేక ముప్పదిఐదు ఏండ్లు వచ్చినా పెళ్లి పెటాకులు లేకుండా ఎక్కడెక్కడో తిరుగుతూ అందరిని హేళన చేస్తుంటాడు జగన్.

ఈ విధంగా కవికుమార్ గురించి వాళ్లు చేసే దుర్విమర్శల్ని విన్న సర్పంచ్ ధర్మారావు ఇంకా ఆగలేకపోయాడు. వాళ్ళకు "తగిన బుద్ధి చెప్పాలనుకొని లోనికి వచ్చి ఏమయ్యా పెద్దన్న లు మీరేనా కవికుమార్ గురించి విమర్శించేది" అన్నాడు. ధర్మారావుని చూడగానే అక్కడున్న వాళ్ళంతా లేచినిల్చున్నారు.

"ఏమయ్యా కాంతయ్యా! రాత్రి పగలు ఏ ధ్యాస లేకుండా పేకాటాడుతూ జోరుగా తాగేసేవు గొప్పవాళ్ళ గూర్చి విమర్శిస్తావా?

ఏం మల్లయ్యా! అన్యాయంగా నీవు లక్షల డబ్బు సంపాదించినా ఇంట్లోకాని బయటకాని నీకేమైనా విలువుందా? అసలు నీ భార్యా పిల్లలైనా నిన్ను గౌరవిస్తారా? కవి కుమార్‌కు

నీవు ఆ సిఫార్సులు లేవని విమర్శిస్తావా? కవికుమార్ లాంటి గొప్ప వాళ్ళ గూర్చి మాట్లాడే తెలివుందా నీకు? ధనం కన్నా మంచి గుణం, తెలివి తేటలు ముఖ్యమని తెలుసుకో.

ఏమండీ రమేష్ గారూ! ఉద్యోగం చేసే తెలివి లేక ఉన్న గుమాస్తా ఉద్యోగాన్ని ఊడ గొట్టకొని ఇంట్లో బడాయిలు కొట్టే నీవు కవికుమార్ కవిత్వం గూర్చి విమర్శిస్తావా? ఇతరుల రచనల్ని కాపీ చేసి కవిత్వం వ్రాస్తాడా కవికుమార్. ఎలా అన్నావయ్యా ఆ మాటలు ఏ కవి కాపీ చేసి రాణించలేడు తెలుసుకో.

ఏమమ్మా వీరమ్మా! నీ మొగడు అసమర్థుడైనంత మాత్రాన అందరిని అసమర్థులనుకోకు. గొప్పవాళ్లను చూసి వాళ్ళ పై ఈర్ష్యా ద్వేషాలు పెంచుకొని దుష్ప్రచారాలు, దుర్విమర్శలు చేస్తావా? ఏమి తెలియని నీకు గర్వం పనికిరాదమ్మా.

ఏమండీ జగన్ గారూ! ఏమీ తెలియకున్నా అన్నీ నాకే తెలుసునని గర్విస్తూ అందరిని హేళన చేస్తూ బండ క్రింది కప్పలా బతికే నీవు కవి కుమార్‌ను విమర్శిస్తావా? అన్నాడు సర్పంచ్ ధర్మారావు. కాంతయ్య, సుబ్బయ్య, రమేష్, జగన్, వీరమ్మలు సిగ్గుతో తలలు వంచుకొని నిల్చున్నారు.

ఇకనుండి మీరెప్పుడైన గొప్ప వాళ్ళ గూర్చి మంచి వాళ్ళ గూర్చి చెడుగా మాట్లాడితే మిమ్మల్ని పదిమందిలో అవమానపరిచి తగిన శిక్ష విధిస్తాను. మనకు తెలివి తేటలు లేకున్నా ఇతరులకున్న తెలివితేటల్ని గాని, మంచితనాన్ని గాని చూసి ఆనందించాలి. వీలైతే వారిని హృదయపూర్వకంగా గౌరవించాలి. కాని వారి పై ఈర్ష్యాద్వేషాలు పెంచుకొని దుష్ప్రచారాలు దుర్విమర్శలు చేయకూడదు.

మన ఊరిలో పుట్టి ఎన్నో మంచి పుస్తకాలు వ్రాసి కవిగా గొప్పవాళ్ళచే ప్రశంసింపబడుతూ సాహిత్య సేవ చేస్తున్న కవికుమార్ మన గ్రామానికి తలలాంటివాడు. అలాంటి కవిని గౌరవించడం నాది తప్పంటారా మీరే ఆలోచించి చెప్పండి" అన్నాడు ధర్మారావు.

"అయ్యా మాది తప్పైపోయింది ఇకనుండి గొప్పవాళ్ళ గూర్చి, మంచివాళ్ళ గూర్చి దుష్ప్రచారాలు దుర్విమర్శలు చేయము మా తప్పేమిటో మేం తెలుసుకున్నాం మమ్మల్ని మన్నించండి" అన్నారు. కాంతయ్య, సుబ్బయ్య, వీరమ్మ, రమేష్, జగన్ లు అవమానంతో క్రుంగిపోతు.

నీతి:- మంచివాళ్ళపై గొప్పవాళ్ళపై ఈర్ష్యాద్వేషాలు పెంచు కొని దుర్విమర్శలు, దుష్ప్రచారాలు చెయకూడదు.

## తాతగారు చెప్పిన మంచి మాటలు

తాలూక ఆఫీసులో ఉద్యోగం చేస్తున్న మురళీకృష్ణ ఇటీవలె జ్యోతిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. తనను పెంచి పెద్దచేసిన పితామహుని ఆశీర్వాదములు పొందడానికి స్వగ్రామమైన జగ్గాపురానికి భార్యతో సహా బయలుదేరాడు మురళీకృష్ణ.

మురళీకృష్ణ ఐదు సంవత్సరముల వయస్సులోనే తల్లి తండ్రులను కోల్పోయాడు. అప్పటినుండి తాతగారైన ధర్మయ్య ఎంతో గారాబంగా పెంచి పెద్దచేశాడు. ఎనభై సంవత్సరముల ధర్మయ్య పండితుడు అన్నీ తెలిసినవాడు. ముఖ్యంగా జీవితాన్ని కాచి వడబోసిన అనుభవజ్ఞుడు. అందుకని ఆ ఊరులోని వారే గాక ఆచుట్టు ప్రక్కలగల గ్రామాల్లోని వారుకూడా ధర్మయ్య గారి దీవెనలు, సలహాలు పొందుతూ ఉంటారు.

మురళీకృష్ణ, జ్యోతి వరండాలో మంచంపై కూర్చున్న

ధర్మయ్య గారిని సమీపించి పాదాభివందనం చేస్తూ "తాతగారూ! మా సంసార నౌక సాఫీగా సాగిపోవుటకు మీదీవెనలు, అమూల్యమైన సలహాలను అందించండి" అన్నారు వినయంగా.

ధర్మయ్యగారు వాళ్ళను నిండు మనస్సుతో దీవిస్తూ "బాబూ! మురళీకృష్ణా! భార్యా భర్తల అనుబంధం చాలా గొప్పది. భార్యా భర్తలు ఒకరినొకరు అర్థం చేసుకోవాలి ఒకరి తప్పుల్ని ఒకరు తెలుపుకొంటూ సరిదిద్దాలి. ఒకరిమంచిని ఒకరు అభినందిస్తూ, కష్ట సుఖాలలో ఎల్లప్పుడు ఒకరి సుఖాన్ని ఒకరు కోరుకొంటూ ఉన్నంతలో తృప్తిపడుతూ అన్యోన్యంగా జీవించాలి. భార్యా భర్తలు హాయిగా జీవించాలంటె ధనం ఉంటే సరిపోదు అందం ఉంటే సరిపోదు. అన్నింటికన్నా ముఖ్యం ఆత్మ సౌందర్యముండాలి. తెలివితేటలు ఉండాలి. అసమర్థుడు, తెలివి తేటలు లేకున్నా గొప్పలు చెప్పుకునేవాడు, దుర్మార్గుడు, చెడు అలవాట్లతో ప్రవర్తించేవాడు భార్య ప్రేమను పొందలేడు తన భర్త తెలివితేటలతో విజ్ఞుల మెప్పు పొందాలని, సత్ప్రవర్తనతో జీవించాలని, ఎన్ని కష్టాలున్నా తనతో తగిన విధంగా ప్రశాంతంగా గడపాలని ప్రతి ఇల్లాలు కోరుకుంటుంది. ఈ విషయాల్ని తెలుసుకొని భర్త తెలివి తేటలతో, సత్ప్రవర్తనతో భార్య కనుకూలంగా మెదులుతూ హాయిగా జీవించాలి. ఇక భార్య హద్దు మీరిన ఆడ పెత్తనం చెలాయిస్తూ భర్తను చవటగా తయారు చేసి విచ్చల విడిగా తిరుగుతూ పదిమంది హేళన చేసే విధంగా

ప్రవర్తించకూడదు. అణకువతో, తెలివితేటలతో సత్ప్రవర్తనతో భార్య జీవించాలి.

కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా శయనేతు వేశ్యా
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ

ఇంటి కార్యములందు పనికత్తెవలెను; కార్యాలోచన యందు మంత్రివలెను; రూపమునందు; లక్ష్మివలెను; ఓర్పునందు భూమివలెను; ఆహారమునందు తల్లివలెను; పడక యందు వేశ్యవలెను—ఈ రీతి ప్రతి విషయమున ప్రవర్తించునది కులస్త్రీ యనబడును కాబట్టి ప్రతి ఇల్లాలు పై శ్లోకంలో చెప్పినట్లు సత్ప్రవర్తనతో జీవించాలి. సంసారమను బండికి ఆలుమగలు రెండు చక్రాల్లాంటివారు కాబట్టి భార్యా భర్తలు సత్ప్రవర్తనతో అన్యోన్యంగా ఉంటూ జీవితాన్ని సుఖమయం చేసుకోవాలి. ఇక ఇరుగు పొరుగు వారితో, బంధువులతో, స్నేహితులతో ఎవరికి తగినట్లుగా వారికి ప్రవర్తిస్తూ సజ్జనులు మెచ్చే విధంగా జీవితాన్ని ఆదర్శంగా తీర్చి దిద్దుకోవాలి" అంటూ ముగించారు ధర్మయ్య గారు.

జీవితాన్ని తీర్చి దిద్దుకునే అమూల్యమైన సూక్తులు చెప్పినందుకు తాతగారికి మరోసారి పాదాభివందనం చేసి సెలవు తీసుకున్నారు మురళీకృష్ణ జ్యోతిలు.

ఆనాటి రాత్రి పడకగదిలోకి వచ్చిన జ్యోతిని దగ్గరకు

తీసుకుంటూ "ఏమండి జ్యోతిగారూ! తాతగారు చెప్పిన మంచి మాటల్ని మనం తు. చ. తప్పకుండ ఆచరించాలి. పడక గది యందు ఇల్లాలు వేశ్యవలె కవ్విస్తూ, నవ్విస్తూ ప్రవర్తించాలని చెప్పారుకదా! ఆ మాటను మాత్రం మరచిపోకు సుమా!" అన్నాడు కవ్వింపుగా మురళీకృష్ణ.

"ఓహో ఆమాటను మాత్రం చక్కగా జ్ఞాపకముంచుకున్నట్లున్నారు శ్రీవారు" అంది ఉడికిస్తూ జ్యోతి.

"ఆ ఒక్కమాటేకాదు. తాతగారు చెప్పినమంచి మాటలన్ని జ్ఞాపకముంచుకుంటాం తు. చ. తప్పకుండ ఆచరిస్తాం జీవితాన్ని సుఖమయం చేసుకుంటాం! ఇక కౌగిట్లోకి రండి దేవిగారు" అన్నాడు నాటక ఫక్కీలో మురళీకృష్ణ.

ఆతని నటనకు, చిలిపి చేష్టలకు నవ్వుతూ సంతోషంగా అతని కౌగిట్లోకి చేరి గువ్వలా ఒదిగి పోయింది జ్యోతి.

---

## * మంచి మాటలు *

నీ చెడుగుణాలే నిన్ను శిక్షిస్తాయి.
నీ మంచి గుణాలే నిన్ను రక్షిస్తాయి.

నీవు చేసేపని మంచిదైనప్పుడు ఎన్ని అవరోధాలు, ఎన్ని అవమానాలు కలిగినా ధైర్యంతో ఎదుర్కొంటూ విజయం సాధించాలి.

తెలివితేటలతో, మంచితనంతో, ఆత్మ విశ్వాసంతో గౌరవంగా బ్రతికేవారికి దుర్మార్గులైన శత్రువులు ఎక్కువగా ఉంటారు. దుష్ప్రచారాలు చేస్తుంటారు. ఐనా

గొప్పవాళ్లెప్పుడు దుర్మార్గులైన శత్రువుల్ని లెక్కచేయకుండా ప్రగతిని సాధిస్తూనే ఉండాలి. సూర్యునివలె ప్రకాశిస్తూనే ఉండాలి.

పెద్ద వాళ్ళకు మంచివారన్నా, మంచి నడకలన్నా, మంచి మాటలన్నా గిట్టవు. కావున పెద్దవాళ్లకు మంచిమాటలు చెప్పకూడదు. అపనిందల పాలు కాకూడదు.

బాగా డబ్బు సంపాదించే వారినే గొప్పవారనుకోకూడదు. ఎందుకంటే దొంగతనం, వ్యభిచారం మొదలైన అవినీతి పనులెన్నో చేస్తు ఎంతడబ్బైనా సంపాదించవచ్చు. పేదవాడైనా సరే న్యాయంగా డబ్బు సంపాదిస్తూ, నీతిగా బ్రతుకుతూ, తెలివితేటలతో, మంచితనంతో సమాజానికి పనికివచ్చే మంచి పనుల్ని చేసేవాళ్లు నిజమైన గొప్పవాళ్లు అలాంటివారినే మనం గౌరవించాలి. పూజించాలి.

తృప్తిని మించిన సిరిసంపదలు లేవు.

అందంకన్నా, సిరిసంపదలకన్నా ఆత్మసౌందర్యం మిన్న.

చెప్పుడు మాటలు విని నిజానిజాలు తెలుసుకోకుండ ఇతరుల పై దురాభిప్రాయన్ని పెంచుకోవడం చాలా పొరపాటు. అంతేకాదు ఎన్నో అనర్థాలు కూడ కల్గుతాయి.

ఎవరి కర్తవ్యాన్ని వారు సక్రమంగా నిర్వర్తించనివారు దేశానికి చీడపురుగుల్లాంటివారు.

పదవి ముఖ్యంకాదు. ఏపదవిలో ఉన్నా కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించువాడే గొప్పవాడు.

అవివేకులతో, దుర్మార్గులతో మెప్పుపొందడం గొప్పతనం కాదు. వివేకులతో సజ్జనులతో మెప్పు పొందాలి అదే అసలైన గొప్పతనం.

నీ హోదాద్వారగాని, డబ్బుద్వారగాని, నీకు జై కొట్టే కిరాయి మనుషుల ద్వారగాని నీ తప్పుల్ని కప్పిపుచ్చుకొని ఇతరులదే తప్పనిపించినా భగవంతుణ్ణి మభ్య పెట్టలేవు. నీ ఆత్మను ఒప్పించలేవు. తప్పు నీదైనప్పుడు నీ ఆత్మ క్షోభిస్తూనే ఉంటుంది. భగవంతుడు ఏదో విధంగా నిన్ను శిక్షిస్తూనే ఉంటాడు. కావున ఇతరులకు చెడ్డ పేరు తేవాలనిగాని, ఏవిధమైన అపకారం కాని చేయకు.

నీవు మంచివాడివైతేనే మంచివారిని, కళాకారుల్ని, గొప్పవారిని గౌరవిస్తావు. నీవు చెడ్డవాడివైతే వాళ్ళను హీనంగా తలుస్తూ అగౌరపరుస్తావు.

అసమర్ధులైన అధికారులవల్ల అన్నీ అనర్ధాలే కలుగుతాయి కావున అసమర్ధులు అధికార బాధ్యతల్ని చేపట్టకూడదు. సమాజానికి నష్టం చేయకూడదు.

అసమర్ధుణ్ణి ఎవరు గౌరవించరు. చివరికి భార్యకూడ హృదయ పూర్వకంగా గౌరవించదు ప్రేమించదు. అసమర్ధుడు దేనికి పనికిరాడు. కావున సమర్ధులై జీవించాలి. సమాజానికి సహకరించాలి.

మంచివాళ్లు, గొప్పవాళ్లు మనకు శత్రువులైతే బాధపడాలి. కాని అవివేకులు, దుర్మార్గులు శత్రువులైతే బాధపడకూడదు. పైగా సంతోషించాలి. ఎందుకంటే దుర్మార్గులు దూరంగా ఉంటేనే మంచిది కదా!